
అపారమైన శక్తియుత్సాహములే
మీ ప్రతిష్ఠను కాపాడగలవు
అమృత
మధురమైన పానీయము


Amrita




జయజయ గృహలక్ష్మీ స్త్రీ సఖి! జయజయ లలితాంధ్ర! మధుర సారస్వతమా!
జయజయ లలనా రత్నమ! జయజయ విద్యాప్రబోధ! జయకల్యాణీ!

వ్యవస్థాపకులు :
డాక్టరు కే. యన్. కేసరి

ఎడిటర్ :
సి. సి. పున్నయ్య

# ఎన్నికల సప్తాహం

రానున్న ఎన్నికలకు దేశం మొత్తం ఆయత్తమగుచున్నది. దేశంలోని పార్టీలన్నీ తమ ప్రణాళికలతో ప్రచారానికి రంగంలోనికి దిగినవి. ఈ సందర్భమున నాయకుల ప్రబోధాలు, సూచనలు ప్రజానీకానికి మార్గదర్శకం కాగలవని, జనవాక్య నిర్ధారణ మరింత పటిష్టమైన, ప్రజాహితమైన ప్రభుత్వ యంత్రాంగ నిర్మాణమునకు తోడ్పడగలదని యూహించే యీ సమయంలో ప్రజలకు యుక్తాయుక్త పరిజ్ఞానం, జాతీయశ్రేయస్సుపట్ల ఆసక్తి అత్యవసరాలు.

పార్టీలు ఏవైనా జాతీయ శ్రేయస్సుకు, దేశంలో శాంతి భద్రతలకు దోహదమీయగల రాజకీయ పార్టీ నాయకత్వం దేశానికి కావాలి. జాతీయ సమైక్యతను చిన్నాభిన్నంచేసి, ఉమ్మడి శ్రేయస్సుపట్ల ఆసక్తిలేక, దేశంలో శాంతి భద్రతల నాశించని ఏ పార్టీ నాయకత్వము రానున్న ఎన్నికలలో నెగ్గినా ప్రమాదకరమే.

మహోజ్వలమైన కాంగ్రెసు నాయకత్వంలో కొందరు వ్యక్తులవలన కొన్ని లోపాలు ఏర్పడినా కాంగ్రెస్‌కు మహత్తరమైన చరిత్రయుంది. ఆనాటి నుండి యీనాటివరకు దేశం మొత్తాన్ని దృష్టిలో నుంచుకొని జాతీయతను, ఉమ్మడి శ్రేయస్సును అభివృద్ధి అభ్యుదయాలను రూపొందించడానికి నిర్విరామంగా నిర్మాణయుక్తంగా కృషి సాగిస్తున్నది. ఈనాటి కొందరు కాంగ్రెసు వాదులలో చిత్తశుద్ధి లోపించి యుండవచ్చు; నైతికస్థాయి దిగజారి యుండవచ్చు; స్వార్థరహితమైన సేవాత్యాగాలపట్ల ఆసక్తి లోపించి యుండవచ్చు, అంతేకాని సంస్థగా కాంగ్రెస్ ఉత్తమ ఆదర్శ లక్ష్యాలను విడనాడలేదు. తమ కార్యక్రమంలోను, ప్రణాళికల స్వరూప నిర్ణయంలోను, పరిపాలనా వ్యవహారాలలోను ప్రజాభ్యుదయానికి ప్రాధాన్యం, దేశంలో శాంతి సమరసాలకు అనువగు వాతావరణము, దేశరక్షణకు కట్టుదిట్టమైన ఏర్పాటులు రూపొందించటానికి కృషి సాగిస్తున్నది. ఇట్టి సంస్థయైన కాంగ్రెస్ నాయకత్వము దేశానికి, ప్రజలకు కూడ అత్యవసరము. ఈ నాయకత్వము జాతీయ, అంతర్జాతీయ రంగాలలో దేశానికి, ప్రజలకు మహత్తరమైన కీర్తి ప్రతిష్ఠలను సాధించిపెట్టింది. సాధించిన అభివృద్ధి అభ్యుదయాలు ప్రపంచవ్యాప్తంగా అభినందనల నందుకున్నది. కాంగ్రెస్ నాయకత్వానికున్న యోగ్యతలు దేశంలో మరే పార్టీకి లేవు కాబట్టే యీనాటికి సయితము ప్రజాభిమానమునకు పాత్రముగా నున్నది.

శాసన సభలకు అభ్యర్థుల నిర్ణయ సందర్భమున స్త్రీలకు సముచితస్థానం యిచ్చి తీరాలి. విద్యాదియోగ్యతలు, శక్తిసామర్థ్యాలు ఉండి ప్రజాసేవకు అంకితమయ్యే స్త్రీలను అభ్యర్థులుగా నిర్ణయించడము, వారు పరిపాలనా యంత్రాంగములో గురుతరమైన బాధ్యతలను నిర్వహించడం జాతీయ విశిష్టతకు సూచకము. ఈనాడు రాజకీయరంగంలోని ఒడిదుడుకుల, అక్రమాల నివారణోపాయం ప్రజాప్రతినిధులుగా ఎక్కువమంది స్త్రీలు ఎన్నుకోబడటం, వారు పరిపాలనా బాధ్యతల నిర్వహించడం కాగలదని ప్రజలు గ్రహించాలి. పరిశోధనగానైనా స్త్రీలకీ అవకాశం మనదేశంలో యీ ఎన్నికలందు కల్పిస్తే మున్ముందుకి మేలైన ఫలితాలు అమరడమే కాకుండా ప్రపంచంలోని యితర దేశాలకు మనదేశం ఆదర్శనీయం కాగలదు. అదేకాకుండా గతంలోని తమ అవకతవకలను, సంకుచిత దృష్టిని మార్చుకొని స్త్రీలను చూచి పశ్చాత్తాపపడగలరు.

---

# నేటి రచనలలోని లోపాలు

ప్రముఖ రచయిత, విమర్శకుడు శ్రీ శ్రీవాత్సవ చిత్తూరు జిల్లా రచయితల సమావేశములో మాట్లాడుతూ మా భాష, మా సాహిత్యం, మా సంస్కృతి - వీటిని

మించినవి లేవనే దురభిమానం, పరభాషా సాహిత్యంనుండి అపహరించి తమదేనని ప్రకటించుకోడం, మానవులను దానవులుగా మార్చే చౌకరకపు అవినీతికర రచనలు యీనాటి రచనలలోని లోపాలకు కారణమన్నారు.

రచయితగా భాషాపటిమ, విషయ పరిజ్ఞానం, అనుభవము, పరిశోధనాత్మక కృషి అవసరము. ఇవియన్నీ కలవాడే ఉత్తమ రచయిత.

మా భాష, మా సాహిత్యం, మా సంస్కృతి యనే అభిమానం అవసరమే. కాని అది పరిమితిని మీరిపోవడంవల్ల దురభిమానంగా పరిణమిస్తుంది. ఆ దురభిమానం ఎదటివారి భాషా, సంస్కృతి సాహిత్యాల ఔన్నత్యాన్ని గుర్తించనీయక సంకుచిత తత్వానికి గురిచేస్తుంది. అట్టి పరిణామము జాతీయతకు కాని, ప్రజలలో విద్యా వికాసాలకు, పరస్పర సద్భావ, సాన్నిహిత్యాలకు గాని తోడ్పడదు. పైగా దురభిమానం గల రచయిత వాస్తవిక పరిజ్ఞానానికి దూరమగుతాడు.

పరభాషా సాహిత్యం నుండి కొన్ని పదాలను, భావాలను అరువు తీసికోడం, తమ భాషాసాహిత్యాలలో వినియోగించుకోడం గొప్పనేరం కాదు కాని చౌర్యం మాత్రం ద్రోహం. దొంగిలించినది తమదేననడం మరీ ద్రోహం. నీతినియమాలకు ప్రాధాన్యమిచ్చి తమ రచనలు జాతికి, దేశానికి మేలు చేయాలని ఉద్దేశించే రచయితలు అపహరించినదానిని తమదని వేషం వేయడం క్షమార్హం కానేరదు. ఉత్తమ ఆదర్శ్య లక్ష్యవాదిగా రచనలు సాగించువాడు కష్టజీవియైనా ఆత్మ పరమాత్మల దృష్టిలో ఉత్తమోత్తముడు.

ఇక విషయ పరిజ్ఞానం, పాండిత్యగరిమలు ఏపాటిపైనా ఉత్తమ ఆదర్శలక్ష్యాలు లేని చౌకబారు రచనలు ఎవరికీ ఏ విధంగానూ ఉపయుక్తం కాకపోగా మానవ స్వభావాన్నే మార్చి దానవులుగా మార్చగలవు. ముఖ్యంగా కథాసాహిత్యం సమర్థమైన హంతకులుగానో, దొంగలుగానో, తిరుగుబోతులుగానో, రౌడీలుగానో ప్రజలను రూపొందించడానికి తోడ్పడితే అట్టి రచనలు ముమ్మాటికి మానవుని మనుగడకే ప్రమాదకరములు.

అందరికిమల్లె రచయితలకు గురుతర బాధ్యతలున్నవి. కాబట్టి రచయితలుగా చలామణి కానుద్యుక్తులగువారు తమ యోగ్యతలను పరిశీలించుకొంటూ, జాతీయ సౌభాగ్యాల నుద్దేశించి ఉత్తమ ఆదర్శలక్ష్యాలను ప్రజలకు ప్రబోధిస్తూ రచనలను సాగించాలి!

---



# త్రాగుబోతు


జర్మను మూలం :
హాన్స్ ఫల్లాడా

ఆంధ్రానుసరణ :
డాక్టరు వి. ఎస్. శర్మ




## ఇంతవరకు సాగినకథ

[ఇది సామ్మర్ అనే మధ్యతరగతి వ్యాపారస్థుని ఆత్మకథ. రోజులు అచ్చి వచ్చేటంతవరకు సామ్మర్ బాగా డబ్బు సంపాదించాడు. వూళ్ళో పేరుప్రతిష్ఠలు సంపాదించాడు. అకస్మాత్తుగా ఒకరోజున చుక్క ఎదురైంది. దాంతో త్రాగటానికి అలవాటు పడిపోయాడు. భార్య మాగ్దా ఎంతో చెప్పింది, ప్రాథేయపడింది ఆ పాపిష్ఠి పానీయానికి దాసానుదాసుడు కావద్దని. సామ్మర్ భార్యమాట వింటేనా? అంతేకాదు ఆవిడతో యుద్ధం చేయటానికి ప్రారంభించాడు. డాక్టర్ల ద్వారానైనా భర్తని ఒక దోవకి తీసుకునిరావాలని ప్రయత్నం చేసింది. డాక్టర్లతో కత్తిదూసి మాయమైపోయాడు సామ్మర్ కొంతకాలం. అజ్ఞాతవాసంలో వున్నరోజుల్లో అతనికి గది నద్దెకిచ్చిన "లోబెడాన్స్" అనే కాలాంతకుడు అతని సామాన్లని దోచుకున్నాడు. బ్యాంకులోనుంచి తెచ్చుకున్న సొమ్ములో మూడు వంతులు కాజేసి పలాయనమయ్యాడు. తను మామూలుగా పానీయాలకోసం వస్తూవుండే హోటల్లోకి ఒకరోజు అర్ధపూట ప్రత్యక్షమయ్యాడు మన సామ్మర్ దోవలో చేయాలసిన దుబారా ఖర్చులుచేసి, మిగిలిన డబ్బుతో.——ఇక చదవండి.]

## I

చీకటిలో స్టేషను నుంచి అక్కడికి చేరుకునే దోవ బాగా తెలియకపోవటం మూలాన, అక్కడికి వచ్చేటప్పటికి అర్ధరాత్రయింది. తలుపు మూసివుంది. చలిమూలాన కిటికీలూ వేసేవున్నాయి. లోపల దీపాలు లేవు. అంచేత అప్పుడు ఇంట్లో వున్నవాళ్ళందరూ నిద్రపోతూనే వుండాలి. తలుపు తట్టాను. లోపలివాళ్ళని పిలిచాను. ఎన్నోసార్లు గావుకేకలేస్తూ పిలిచాను. కాని ఎవళ్ళూ జవాబిచ్చిన పాపాన బోతేగా! ఎలిసార్ ఎక్కడ పడుకుండేదో నాకు బాగా తెలుసు. ఆ పిల్ల గది తోటవేపే వుంది. అటు కేసి వెళ్ళి ఎలిసార్‌ని పిలిచాను. ఎన్నోసార్లు పిలిచాను. కాని ఆ గదిలోనుంచి జవాబు వస్తేగా!...

ఇప్పుడు ఏం చెయ్యాలి? బయట గాఢాంధకారము. విపరీతంగా చలి. ఉన్నిదుస్తులు ఎన్ని వేసుకున్నా చలికి ఆగలేక గడగడ వణికిపోతూవున్నాను. తోటలో నేనిప్పుడు వున్న స్థలమంతా పచ్చిక బయలు. అక్కడే కొంచెంసేపు కూర్చుని లాగు జేబులో జాగ్రత్తపరుచుకున్న సీసాను పైకితీసి సగం ఖాళీచేశాను. దాన్లోది ఘాటు పానీయము. అలాటి దానిని కొనాలంటే ఎంతో సొమ్ము తడువుకోకుండా ఖర్చుచేయాలి. ఆరోజు వుదయం నుంచి చుక్క ఎదురై ఎన్నెన్నో కష్టాలు ఎదుర్కొనాలని వచ్చినా, దాంట్లో సొమ్మే చాలవరకు ఆ పాపిష్ఠి లోబెడాన్స్ గుటకాయిస్వా చేసినా,...అదురూ బెదురూ లేకుండా ముందుకు నడవడానికి కావలసినంత డబ్బు వుంది. ఆ సంగతి బాగా తెలియటం మూలానే ఆ వూళ్ళో మంచి పానీయాలను కొని దగ్గర జాగ్రత్తపరుచుకున్నాను. ఎన్నెన్నో పానీయాలని రుచిచూశాను. అవి అన్నీ ఒక ఎత్తు, ఈ

పానీయం ఒక ఎత్తు. దీంతో కని విని ఎరుగని శక్తి ఏదో నాలో రేకెత్తుతూవుంది. వచ్చినపని యేదో దాన్ని ఆ క్షణాన్నే చేసుకోమని పూతనిస్తూ వుంది. దాంతో ఏమేమి చేశానో ఇక ఇక్కడ వివరించటమెందుకు?...

లోపల దీపాలు వెలుగుతూ వున్నాయి. ఏ ప్రక్క చూసినా అలజడి! బయట ఇలా నాటకమాడుతూవున్న నన్ను చూసి వాళ్ళు ఎంత భయపడుతూ వున్నారో ఇక మాటలతో చెప్పతరం కాదు...

కిటికీ సగం తెరుస్తూ ఎవళ్ళో నాకేసి చూస్తూ గజగజ వణికిపోతూవున్నారు వాళ్ళల్లో ఒక్కుమ్మడిగా ఆవహించిన భయభ్రాంతులతో. "ఎవళ్ళు వాళ్ళు?" అని అంటున్నారు. ఆ కంఠం స్త్రీ కంఠం. అది ఎవళ్ళదో తెలుసుకోటం అంత కష్టమైతేగా! హోటలు యజమానురాలిది. ఎలాటి కష్టాలు ఎదుర్కోవలసి వచ్చినా, అలాటి సమయాల్లో ఎంత ఖంగారుపడుతూ వున్నా దాన్నంతా పైకి తెలుపనీయకుండా నాటకమాడే శక్తి ఆవిడది. నా దృష్టి అంతా ఆవిడకేసే! ఆవిడ అడిగిన ప్రశ్నకి జవాబు ఇయ్యకుండా వున్నాను. దాంతో ఆవిడకి చెప్పరానంత ధైర్యం వచ్చింది. కిటికీ బారగా తెరుస్తూ "ఇంత అర్ధరాత్రిపూట ఇక్కడికి రావటమా! ఇంత అల్లరి చేయటమా! త్రాగుబోతులను సన్మార్గంలోకి మార్చటం ఎవళ్ళ తరమవుతుంది?... పెద్దమనిషిమల్లె అలా మౌనంగా వుండటమెందుకు? ఇలాటివాళ్లు ఇంత రాత్రిపూట ఎందుకు వస్తారో నాకు తెలియదనుకున్నావా? హోటలు ఎప్పుడో కట్టివేశాం. ఇప్పుడు ఇక్కడ ఏం దొరకవు. తిన్నగా వచ్చిన దోవనే వెళ్ళిపోవటం మంచిది..." ఏమేమో గొణుక్కుంటూ కిటికీని గట్టిగా మూసింది. లోపల నిశ్శబ్దం. బహుశా ఆవిడ పనిమనిషి పిల్లతో సంప్రదించటానికి ఎలినారు వుండే గదికేసి వెళ్ళివుండవచ్చు అనుకున్నాను. బయట మనిషి వున్నాడని వాళ్ళకి ఇప్పటికి బాగా తెలిసివుంటుంది. ఇంక వాళ్ళు పడుకున్నా నిద్రపోతారా?...

ఆ బుడ్డిని ఖాళీచేశాను. లాగుజేబుల్లో వున్న మరో బుడ్డిని కూడా ఖాళీచేశాను...అంటే నేను అంతదూరం నుంచి వ్యయప్రయాసలతో తెచ్చుకున్న ఈ అమృతతుల్యాలు మాయమైపోయాయి. నాకొక విధమైన తృప్తినిస్తూ మాయమైపోతే ఫరవాలేదనుకోవచ్చు. రెండు బుడ్లు పుచ్చుకున్నా, దాహం! విపరీతమైన దాహం! దాన్ని ఎలా ఓర్చుకోగలుగుతాను!...

తలుపు తట్టాను. మర్యాదగా పిలిచాను ఒకసారి ఆవిడని. ఇంకోసారి ఎలినార్‌ని. బయట ఆ చలిలో నేను పడుతూవున్న అవస్థ వాళ్ళకి బాగా తెలుసు. అయినా తలుపు తీసి లోపల ఆతిథ్యమియ్యకుండా ఇలా నన్ను ఆ పరిసరాలనుంచి వెళ్ళిపొమ్మని గదమాయించటమా? నావంటి ఘరానా మనుష్యులు ఈ అవమానాన్ని మ్రింగివేస్తూ అక్కడినుంచి వెళ్ళిపోవటమా?...

ఆ సమయంలో ఏం తట్టిందో తలుపుని బడబడ బాదాను. "ఎంతసేపు బయట వుండటం? తలుపు తియ్యండి! వెంటనే తియ్యండి!" అని చేయాలసిన రాద్ధాంతం ఇంటిముందు చేశాను. ప్రక్క కిటికీ తలుపు కొంచెం ఓరగా తెరుస్తూ "ఇదిగో నయ్యా! నీకే చెప్పటం? స్త్రీలు లోపల ఒంటరిగా వున్నారని తెలిసికూడా ఇలా అల్లరిచేస్తూ వుంటే... ఈ నిమిషంలో ఇక్కడినుంచి వెళ్ళిపోకపోతివా పోలీసులకి ఫోను చేయాలసి వస్తుంది!..." అని మండిపడుతూ నాకేసి చూస్తూ ఆవిడ అన్నది. అప్పుడు

### మనుష్యులు లావు తగ్గడానికి మార్గం

భారీ మనుష్యుల లావు తగ్గడానికి అమెరికా శాస్త్రజ్ఞుడు ఒ. ఏ. బటిస్టా ఒక మందును కనుగొన్నాడు. అది హల్వాలాగ మెత్తగా నుంటుంది. దీన్ని తింటే ఆకలి చచ్చిపోతుంది. దీనికి రుచిగాని, విటమినుల ఆహార విలువగాని యుండదు. కాబట్టి యీ మందును కొంత కాలము తింటే లావాటివాళ్ళు బక్కచిక్కిపోతారు.

తాము లావెక్కి సుకుమార లావణ్యాలను కోల్పోయామని ఆందోళనపడి ఏవేవో చికిత్సలు చేయించుకో పూనుకుంటున్న ముఖ్యంగా స్త్రీలకు యీ మందు విశేషంగా ఉపకారి కాగలదు.

భయభ్రాంతులతో హడలిపోతూవున్న మనిషి ఇప్పుడు ఎంత మారిపోయింది! త్రాగుబోతులని చూస్తే వాళ్ళ తత్త్వం ఇలా మారిపోతుందని కాబోలు!...

"పోలీసు" మాట వినేటప్పటికి నా వాలకమే పూర్తిగా మారిపోయింది. ఇంకో వేషం వేస్తేగాని ఈ గండం నుంచి బయటపడటానికి వీలుండదనే రహస్యం నాకు తెలుసు. దాహంతో తికమక పడిపోతున్న బండి నాపటం అవసరమని నా ఆత్మారాముడికి పురమాయిస్తూ "ఏమండోయి! ఎందుకలా కోపపడుతారు? తలుపు తీయమని ఎంతసేపటి నుంచి మిమ్మల్ని పిలుస్తూవుండటం? చప్పున తలుపు తీయండి... నేను ప్రొఫెసర్ని..." అని మారు కంఠంతో అన్నాను ముఖం ప్రక్కకి తిప్పుకుంటూ. "ప్రొఫెసరు"ని అన్న మాట ఆ సమయానికి నోటి నుంచి ఎలా వచ్చిందో నాకే ఆశ్చర్యమవుతున్నది!...

ఆ మాటకి ఆవిడ ఆశ్చర్యపడుతూ "ప్రొఫెసరుగారా? ఏ ప్రొఫెసర్?" అని వున్నచోటినుంచే అడిగింది హోటలు యజమాని. "ప్రొఫెసర్" అన్న మాట విన్నాక ఆవిడకి ఏం జ్ఞాపకం వచ్చిందో?... నాకేసి విస్తుపోతూ చూస్తూ "వూ! వూ! ఆ ప్రొఫెసరుగారన్నమాట! క్రిందటి ఎండాకాలం సెలవుల్లో చిత్రాలు వేసుకోటానికి ఈ ప్రాంతాలకి వచ్చి మా హోటల్లో బసచేసిన ప్రొఫెసరుగారేనా?" అని గౌరవం చూపెడుతూ ప్రశ్నించింది.

"వూ! వూ!" అని అన్నాను.

చిత్రకారులు తమాషా మనుషులు. వేళకాని వేళలో ప్రత్యక్షమవటం వాళ్ళ తాహతుకి తగిన అలవాటేగా! "ఎంతసేపని బయట ఇలా కనిపెట్టుకుని వుండటం? చప్పున తలుపు తియ్యండి" అని బింకం — బెట్టుతో అన్నాను.

"ముందుగా ఒక కార్డుముక్క వ్రాసివుంటే ఎంతో బాగుండేది ప్రొఫెసరుగారూ!" ఆప్యాయత ఒలికే కంఠంతో "ఒక్క క్షణం ఆగండి. బీగాలు తెచ్చి తలుపు తీస్తాను" అంటూ లోపలికి వెడుతూ వుంది తన గదిలో జాగ్రత్తపరుచుకున్న బీగాలు తీసుకుని రావటానికి.

"అమ్మయ్యా! కోటలో పాగా వేస్తున్నాం అన్న మాట! ఇంకేం భయంలేదు. ఇటూ దప్పి తీర్చుకో వచ్చు. అటూ కడుపునిండా భోజనం చేయవచ్చు అప్పటికి అక్కడ వుండే పదార్థాలతోనే" అనుకుంటూ వుబ్బితబ్బిబ్బయిపోతూ వున్నాను.

ఇంతలోకి ఆవిడే వచ్చింది. తలుపు తెరుస్తూ "లోపలికి రండి... కాని ఇంత అర్ధరాత్రివూట మా నిద్ర చెడగొట్టటం మాత్రం ఏం బాగాలేదు" చిరునవ్వుతో అన్నది.

తలుపు దగ్గర నేను ఎవడినో ఆవిడ బాగా గుర్తుపట్టింది కాదు. ఆవిడ ముందు నడుస్తూవుంది. ఆవిడ వెనక నేనూ లోపలికి తిన్నగా వస్తూవున్నాను. అది పెద్దహాలు! ఇక్కడి నా అనుభవాలు ఎలా మరచిపోతాను? ఇంకా చీకటిగానే వుంది ఒకమూల మిణుక్కుమిణుక్కుమని దీపం ఒకటి వెలుగుతూ వున్నా! లోపలికి రావడంతో పెద్దదీపం వేసింది. దాంతో హాల్లో దేదీప్యంగా వెలుతురు. నేను లోపలికి అడుగుబెట్టటంతో ఎప్పుడూ కూర్చుండే బల్ల దగ్గరకు వచ్చి ఒక్క నిమిషం ఆగి ఆవిడకేసి వ్యంగ్యంగా చూశాను. ఆవిడ దృష్టి నామీదే. పండ్లు కొరుక్కుంటూ "ఆ! ఇంత మోసం చేస్తావా? అదీ నా దగ్గరా?... పెద్దవాళ్లు! పెద్దవాళ్లు! ఒక నీతీ నియమం వుండాలి. మాకు తెలిసిన ఆ ప్రొఫెసరు అని బుకాయించటమా? ఆ రోజున డాక్టర్లు మంచిపని చేశారు మీలాంటి బుకాయిరాళ్ళకి మంచి పాఠం చెప్పటానికి... అక్కడే వుండిపోక తిరిగి ఇక్కడ దాపరించటమా..." ఆ నోటినుంచి ప్రవహిస్తూవున్నా సూటిపోటు మాటలకి అంతూపంతూ వుండేగా!...

ఆగాను. ఎంతోసేపు ఓపికపట్టి ఆగాను ఆవిడ అంటూవున్న సూటిపోటి మాటలకి ఏం జవాబు చెప్పకుండా! ఇప్పుడు ఏం చేసినా కొంప మునిగిపోతుంది. అంచేత ఆ చీవాట్లకి తలఒగ్గి వుండటమే అన్నివిధాలా మంచిది కదూ!... ఆవిడ అలా అరుస్తూ వుండటం పై మేడమీద వున్న ఎలినార్ విన్నది. యజమాని తత్త్వం ఎలినార్‌కి తెలుసు.... ఆవిడ అంత గొంతు చేసుకోటానికి కారణమేమో తెలుసుకోటానికి ఆదరాబాదరాగా మెట్లు దిగి హాలులోకి వచ్చింది....

నేను ఎవళ్ళకోసం అంత అర్ధరాత్రివూట వచ్చానో ఆవిడే అక్కడ, ఇంత సులభంగా దర్శనమియ్యటంతో హోటలు ఆవిడ చేసే గొడవ పూర్తిగా మరచిపోయాను. నా విషాదావస్థని మరచిపోయాను. ఆప్యాయంగా చేతులు బారచాపుతూ "ఆ వచ్చావా నా ఎలినార్! నీకోసం ఎన్ని పడిగాపులు కాయా

లసి వచ్చింది...అయిందేమో అయిపోయింది. ఆపదల నుంచి ఒడ్డుకి చేర్చటానికి నువ్వు వచ్చావు...'' అని ఏమేమో అంటూ ఆ పిల్లని కవుగలించుకోబోయాను. ఒకప్రక్కన యజమానురాలు ఆ కోపంతో నన్ను భస్మం చేయటానికి తయారుగా వుంది. ఇంకో ప్రక్కన నా ఎలినార్! నా కష్టనిష్ఠూరాలు ఆ పిల్లకి తెలుసు. ఆ పిల్లే నన్ను ఆదరించి దరీదాపులు చూపెడుతుందని ఇక్కడికి వచ్చాను.

ఇలాంటి సమయంలో ఎలా మెలగాలో ఎలినార్‌కి తెలుసు. "ఆ! నువ్వా! నీ వాలకం చూస్తే ఘాటు పానీయాన్నే పుచ్చుకున్నట్లు వుందే! త్రాగుబోతువంటే అక్షరాలా నువ్వే!... ఇంతకూ ఎందుకు ఇలా రావటం? మమ్మల్ని కంగారుపెట్టటమా ఈ నాటకంతో?.. ఇంకా దాహం అవుతుందా?

> బ్రతకడం నేర్చుకుంటేనే బ్రతకడం.
>
> —''గ్రే''
>
> ♦ ♦ ♦
>
> నా అభిప్రాయాలను ప్రజలకి వెల్లడిస్తాను. అవి వారికి నచ్చితే నన్నే ఎన్నుకుంటారు. నచ్చకపోతే నన్ను నెట్టివేయనీయండి. —''ధాకిన్ నూ''
>
> ♦ ♦ ♦
>
> ప్రేమ భావం ద్వేషభావం కన్నా సర్వవిధాల ప్రబలమైంది. ద్వేషాన్ని సాధనంగా వాడేజాతిగానీ, జాతులుగానీ తమలో తాము విద్వేషంతోనే విచ్ఛిన్నమైపోగలవు.
>
> —''ఫ్రాంక్లిన్ డి. రూజ్‌వెల్ట్''
>
> సేకరణ: వేముల కోటుంబరావు

ఏం. ఇయ్యమంటావు ఈ పాపిష్టి దాహం తీర్చటానికి?'' అని కసిరికొడుతూ అన్నది యజమాని ప్రక్కనే నిలుచుని.

"ఆరోజున తెచ్చి ఇచ్చిన బుడ్డినే తీసుకువచ్చి ఇచ్చావా నా బాధ తీరిపోతుంది. అది ఎంత వెల అయితేనేం దాన్నేకాదూ, మీ యజమానికి తృప్తి కలిగేటట్లు వడ్డీ సొమ్ముతో కూడా ఇయ్యటానికి తయారుగా వున్నాను....బోలెడు డబ్బు వుంది నా దగ్గర. ఎంత మొత్తమో చెప్పటం ఇప్పుడు అవసరం లేదులే! ఆవిడ అలా తిడుతూవున్నా నిన్ను చూడటంతో...నువ్వు ఎంతమంచిదానివో నాకు తెలుసుగా! ఈ సొమ్మంతా నీకోసం తెచ్చాను. నావెంట వచ్చేసెయ్యి. ఈ క్షణాన్నే దూరదూర దేశాలకి వెళ్ళిపోదాం రా! బయలుదేరటానికి ముందు ఆ బుడ్డి తీసుకుని వచ్చావా నా కరువు తీరుతుంది...'' ఏమేమో అన్నాను.

ఒకళ్ళ మొహాలు ఒకళ్ళు చూసుకున్నారు. ఎలినార్ గబగబ పానీయాలు అమర్చివుంచిన చోటికి వెళ్ళి ఒక బుడ్డి పుచ్చుకునివచ్చి నన్ను బల్ల దగ్గరికి తీసుకువచ్చి అక్కడ కూర్చోమని ఆజ్ఞాపించింది. తనూ నా ప్రక్కనే కూర్చుని పసిపాపకిమల్లె నన్ను బుజ్జగిస్తూ గ్లాసు నింపుతూ దాన్ని త్రాగటానికి పురమాయించింది.

ఈ దృశ్యాన్ని చూస్తూ, చూస్తూ, ఏమనుకున్నదో హోటలు యజమాని కొంతసేపటికి అక్కడినుంచి అదృశ్యమైంది.

## II

అలా తనివితీరా పానీయాన్ని రుచిమాస్తూ, ఎలినార్‌తో ఆ కబుర్లు ఈ కబుర్లు చెప్పకుంటూ ఎంతసేపు వుండిపోయానో నేనెలా చెప్పగలుగుతాను? ఆ పిల్ల నా మాటలు వింటూ "వూ" కొడుతూ వుండటంతో ఈ మాయలోకాన్నే మరచిపోయాను. పూర్తిగా మరచిపోయాను.

"ఎలినార్! ఎలినార్! నా అవకతవకలని నువ్వు మరచిపోవాలి. ఈ లోకంలో నువ్వు తప్ప మరెవళ్ళు లేరు. వీళ్ళ పోగడలు నువ్వు విన్నావుగా!...ఆవిడ కోరిక మన్నించటానికి ఆ పెద్దలు చేసిన రాద్ధాంతం కళ్లార చూశావు కూడా! నా జీవితంలో అదొక సుడిగాలి. నువ్వు నాకు చేదోడువాదోడుగా వున్న తరువాత అదంతా ఒక లెక్కా పక్కా నాకు! భూతకాలానికి ఒక నమస్కారము పెట్టి, భవిష్యత్తులోకి అడుగు పెట్టాలని వుబలాటపడుతున్నాను. నా జీవిత దృక్పథాన్నే పూర్తిగా మార్చుకోవాలని దీక్ష పట్టాను. అదే స్వర్గాలంటే నువ్వు నన్ను హత్తుకోవాలి ఆ చీకటి కూపాలని మరచిపోటానికి ధైర్యమిస్తూ.. ఇక్కడే వుండవచ్చుఅనుకున్నాను. కాని – ఆ పూరి విషజ్వాలలు ఇక్కడికి కూడా వచ్చాయి. ఇలాంటి చోట్లలో ఎలా వూపిరి పీల్చుకోటం? ఇప్పుడే బయలుదేరదాం. తిన్నగా దక్షిణాదికే! బ్రహ్మాండమైన ఆ కొండప్రాంతం అస్త

మానమూ మలయమారుతం వీస్తూ మనుషుల వాలకాన్నే పూర్తిగా మార్చివేస్తూ వుంటుంది. ఆ కొండల మీద కోటలు వున్నాయి. రాజులకే లభ్యంకాని ఆతిథ్యం యిస్తూ మన జీవితాలనే నిత్యకల్యాణం పచ్చతోరణంగా మార్చివేస్తాయి...ఎప్పుడూ "వూ" కొట్టుతూ వుండేదానివి ఇప్పుడు "వూ" కొట్టటం లేదే!..." అని దిక్కుమొహం వేసుకుని ఎలినార్ కేసి చూశాను ఆ పిల్ల అందిస్తూ వుండే గ్లాసులోని దాన్ని పొట్టనింపుకుంటూ. ఆ ద్రావకంతో చెప్పరానంత శక్తి వచ్చింది. నా కళ్ళ ముందర ఎలినార్ దేదీప్యమానంగా మెరిసిపోతున్నది. ఆ చిత్రాన్ని చూస్తూ పరవశమైపోతూ "ఇంతకూ ఏమంటావు? బయలుదేరటానికి సిద్ధంగా వున్నావా?" అని వీపుని ఆప్యాయంగా తడిమాను. ఎలినార్ తల వొంచుకుని "వూ! నువ్వు అలా వుబలాటపడుతూవుంటే నేను కూడా నీ వెంట రాకుండా ఇక్కడే వుండిపోతానా? ఇవ్వాళే మన ప్రయాణం. ప్రొద్దున్నే ఆరు గంటలకి స్టేషను నుంచి రైలుబండి బయలుదేరుతుంది. అంత వరకు వోపికపట్టి వుండాలి. ఇక్కడ్నే అంతవరకు వుండిపోదామా లేక బయట తోటలో పచారుచేస్తూ వుందామా?" అని నా తల నిమురుతూ అంది.

ఆ మాటేగా నాకు కావాలసింది నా ఎలినార్ దగ్గరనుంచి. దాంతో అప్పుడే నా జీవితంలో సూర్యోదయమైనట్లు వుంది.

"బయట ఎందుకు? ఇక్కడ్నే వుండిపోదాం. బండి ఆరు గంటలకా? అంతవరకూ వోపికపట్టి వుండకపోతే తరువాత మన బండి ఎలా కదులుతూ వుంటుందనుకున్నావు?...మనం తిన్నగా చేరుకోటం దక్షిణాదికే! ఏమంటావు?"

"వూ! దక్షిణాదికే మనం ప్రయాణమవటం! కాని...కాని ఒక్క షరత్తుమీద! ఇలా అక్కడ త్రాగుతూ వుండటం ప్రమాదం. త్రాగుబోతులంటే నాకు చిరాకు. వాళ్ళ మొహాలు చూస్తుంటే అసహ్యంగా వుంటుంది..."

"నీ కోరిక తప్పక చెల్లిస్తాను, ఎలినార్! నువ్వు నీ చేతిమీదుగా ఇస్తే తప్పక గ్లాసుకేసే చూడను. నా జీవితలక్ష్మివి నువ్వు! నువ్వు వుండగా అదంతా ఎందుకు నాకు?" అన్నాను.

ఎలినార్ నా జేబులు తడుముతూ "ఇంతకూ ఎంత డబ్బు వున్నట్లు? మనం చేయబోయే ప్రయాణానికి బోలెడు డబ్బు అవుతుందే!..." అని ఓరకంటితో నాకేసి చూస్తూ అన్నది ఎలినార్.

"డబ్బు కోసమూ ఇలా ఖంగారుపడటం? కావలసినంత డబ్బు నా దగ్గరేవుంది. మన ఇద్దరికీ బాగా సరిపోతుంది. ఇటుకేసి రాకుండానే అక్కడే యావజ్జీవం వుండిపోటానికి కావలసినంత సొమ్ము వుంది..." అని డబ్బంటే జలప్రాయమన్నట్లు ఆ పిల్లకి చూపెట్టటానికి లోపలి జేబుల్లో భద్రపరుచుకునివున్న నోట్లని తీసి బల్లమీద వుంచాను. నోట్లని లెఖ్ఖపెడుతూ, "ఇంతకూ నీ దగ్గరవుంది ఎనిమిది వందల అరవయ్యే!" అని మెల్లగా నవ్వుతూ "మన ప్రయాణానికి ఇదేం చాలుతుంది! రోజుల పర్యంతం రైళ్ళల్లో వెళ్ళాలి. జీవితమంతా ఇద్దరం కలిసిమెలిసి వుండాలని కలలు కంటున్నావే! అక్కడ కాయకష్టం చేసుకోకపోతే ఇదేం చాలుతుంది చెప్పు?... ఇంతేనా నీ దగ్గరవుంది? లేక..." అని ఏమో అనబోతున్నది.

నేనే అడ్డువస్తూ "ఇంకా ఎంతో తెచ్చాను. ఆ భడవ దాన్నంతా కాజేశాడు. అంతేకాదు! నేను తెచ్చుకున్న మూటముల్లెల్ని కూడా గుటకాయిస్వాహా చేశాడు. ఈ సంగతి మాగ్గాకే తెలిస్తే ఎంత బాధపడుతుందో నువ్వు బాగా వూహించుకోవచ్చుగా!" అని అంటూ ఎలినార్ కేసి చూస్తూ నిట్టూర్పు విడిచాను. ఆ పిల్ల జవాబియ్యటానికి ముందే "ఈ సొమ్ముని దక్కించుకోటానికి ఎంత కష్టపడాలని వచ్చింది. ఆ దృశ్యం చూస్తే నువ్వే గడగడ వణికిపోతావు!...బ్యాంకులో సొమ్మంతా నా పేరటనే వుంది. ఒక చెక్కు వ్రాసి ఇచ్చానా పదివేలు గబగబ మన దగ్గరికే పరిగెత్తుకుని వస్తాయి" అన్నాను.

"సాహసమంటే నీదే సాహసం! ఈ డబ్బు సంగతి మాత్రం, మన ప్రయాణం సంగతీ ఎవళ్ళకీ చెప్పటం అంత మంచిదికాదు. నా దగ్గర జాగ్రత్త పరచమంటే అలానే చేస్తాను ఈ సొమ్మంతా? ఇంత సొమ్ము ఇతర్ల కంటపడిందా..." అని అన్నది. బుడ్డిలో ఇంకా మిగిలివున్న పానీయాన్ని గ్లాసులో నింపి నా చేతికి ఇచ్చింది. తనూ ఒక గ్లాసులో కొంచెం పోసుకుని "ఇదే ఆఖరిసారి! ఇంక ఎప్పుడూ దీనికేసి తాపత్రయపడనని ఇంకోసారి వాగ్దానం చెయ్యాలి ఈ కడపటి గ్లాసుని త్రాగి తృప్తిపడుతూ" అని అన్నది తను రుచిచూస్తూ. నేనూ ఆ గ్లాసులోనున్న దానిని ఒక్క క్షణంలో మాయంచేస్తూ వుండటం చూస్తూ మందహాసం చేసింది ఆ అమ్మాయి, నాకింత అభయహస్తమిచ్చిన నా ఎలినార్.

# ఐతరేయోపనిషత్తు

## పూజ్యపాద స్వామీ చిన్మయానందులవారి వ్యాఖ్యానములు-

అనువాదము: Dr. W. రాధాకృష్ణయ్య

(గతసంచిక తరువాయి)



అయినను, ఇట్టి వ్యవహారములను విరమించుకొను ప్రయత్నములు నేటి ఒడుదుడుకు కాలమున, అనుభవించగలుగుట కల్ల. మానవుడు తన విరామకాలమును సద్వినియోగపరచు విధానము మరచియున్నాడు. మరణమాసన్నమగువరకు, ఉద్యోగమును వదల నిచ్చగించుటలేదు. నేటికాలమున వ్యవహార విరామమంతయు, మరణానంతరమున కలుగుచున్నది. ఎంతటి గౌరవనీయుడగు న్యాయప్రభువుగాని, వైద్యుడుగాని, పండితోత్తముడుగాని, ఇంజనీయరుగాని, యేదోయొక నెపముతో, వ్యవహార విరామము పొందగల వయసు చేకూరినను, వ్యవహారములకు వారు యోగ్యులు కారని సమాజము చాటుచుండినను, విరమించుకొన ఇష్టపడుటలేదు.

సుభిక్షదినములగు వేదకాలమున తరతరముల యందు జనులు విరామకాల మెపుడు కలుగునాయని కాచుకొనుచుండిరి. ఆర్జించుట, ఖర్చుచేయుట, దాచియుంచుట, దాచినదానికి కావలికాచుట, సంతానము పొందుట, రోగముల పాలగుట, వారికి వినుగు జనించుచుండెను. విరామము కలిగినపుడు కాలమును సద్వినియోగపరచి, కృతార్థులగుచుండిరి. ఆత్మాభివృద్ధి పొందుచుండిరి. ఇంద్రియములపై యాజమాన్యము చూపుచుండిరి. జీవితమానందదాయకముగ చేసుకొనగలుగుచుండిరి.

ప్రజ్ఞావంతుడగు తండ్రి, తన సంతతివారు యుక్తవయసు పొందుటతోడనే, తన ఆరోగ్యము క్షీణించకమునుపే, తన వ్యవహార బాధ్యతలనెల్ల, జ్యేష్ఠకుమారునికి యొప్పజెప్పి, తాను విరమించుకొనును. ఆయువు పూర్తియగుటతో, తాను కృతకృత్యుడాయెనను సంతృప్తితో, దేహమును వదలును కుటుంబమువారు నిరాశతో చుట్టుమూగియుందురు. సమాజమున కొరత యేర్పడును. బహిర్గతమయిన జీవుడు, అనుకూలమగు మరొక దేహము నన్వేషించి, బాహ్యప్రపంచమున, తనకు నచ్చిన అనుభవములను పొందకోరుచున్నాడు. ఇట్లతడు ప్రపంచమున మరల జన్మమెత్తుట, అతనికి తృతీయ జన్మమగుచున్నది.

ఇట్లు వర్ణించుటవలన, తండ్రి తనయుల ఏకత్వము, అద్వితీయత్వము శిష్యులు తెలుసుకొనగలరను యభిప్రాయము గురువుల కుండెనని, శంకరులు వచించియున్నారు. శంకరులు తెలుపునట్లు, ఇరువురియందు ఏకాంశము తెలియుటేగాక, ఇందు విశేషభావమున్నదని నేను తలచుచున్నాను. తండ్రి గడచిపోయిన తరమును తెలుపుచున్నాడు. తనయుడు ప్రస్తుత తరమువారిని తెలుపుచున్నాడు తండ్రియొక్క మూడవ జన్మము రాబోవు తరమును తెలుపుచున్నది. కనుక, భూత, భవిష్యత్, వర్తమానములందెల్ల, అన్ని తరములలో వ్యక్తమగుచుండునది ఏకస్వరూపుడు, అను విషయమిందు విదితమగుచున్నది. తండ్రి కుమారులు ఒక రూపమని తెలుపుటలో, ఈ మంత్రము తృప్తిపొందుటలేదు. త్రికాలములందు ఏకసూత్రము వలెనుండు జీవచైతన్యమును గురువు సూచించుచున్నాడు. అట్లు తెలుపుటవలన, ఈ జీవునికి కలిగియుండిన వృక్షజన్మము, క్రిమిజన్మము, మృగజన్మములు కూడ ఇందు భావింపవలసియున్నది. ప్రపంచమునగల జీవరాసులకెల్ల, త్రికాలమందు, ఈ జీవచైతన్యము ఏకము. అద్వితీయమను భావము ఈ మంత్రమున స్పష్టమగుచున్నది.

శాంతముగ విచారించలేని పాఠకులు, ఇటువంటి వేదమంత్రములందు, మాంసమయ శరీరమునకు, అందు గలుగు సంతానక్రమమునకు అధిక ప్రాముఖ్యత కలదనియు, జన్మమరణములను విపరీతముగ ప్రశంసించబడియున్నదనియు, తలచగలరు. రాబోవు మంత్రమున, దీనికి సమాధానము కలదు. జన్మమరణములు దేహమునకు సంబంధమయి యున్నవి. శ్రుతి విచారమంతయు ఆత్మపరమైయున్నది. ఆత్మ ఈ శరీరములలో వ్యక్తమగుటవలన, ఋషులు ఆత్మవిచారము చేయుటయందు మధ్యవర్తియగు శరీర విచారము కూడ కొంత అనివార్యముగ ఏర్పడుచున్నది.

శ్రు॥ తదుక్తమృషిణా. గర్భే ను స
న్నన్వే షామ వేద మహం దేవానాం

జనిమాని విశ్వా. శతం మా పుర ఆయసీ రరక్ష న్నదఃశ్యేనో జవ సా నిరదీయ మితి. గర్భ ఏ వైత చ్ఛయానో వామదేవ ఏవ మువాచ.॥ (5)

[దీని విషయము వామదేవ ఋషి ఇట్లు వచించి యున్నాడు. గర్భవాసమునందే నేను చక్కగ తెలిసి కొంటిని. ఈ దేవతల జన్మములనెల్ల గమనించగలిగి తిని. వందలకొలది లోహమయబంధములు నన్ను బంధించునుగాక, డేగవలె నేను వేగముగ ఎగిరి పోగలుగుచుంటిని. ఈ మాటలు వామదేవ ఋషి గర్భవాసమునుండి పలికియున్నాడు.]

గురువు శ్రోత్రవిషయముల నేదేని తెలిపినచో, శిష్యులా పలుకులతో తృప్తిపడుచుండుటలేదు. ఋషి పలుకులకు వేదసిద్ధాంతము లున్నవాయని సంశయించు దురు. వారి ముఖచిహ్నములవలన, ఇట్టి సందేహము వారికున్నదని గ్రహించి, గురువు, తదనుగుణముగ నుండు వేదమంత్రమును వల్లించి, వారికి నచ్చచెప్పు చున్నాడు. ఈ మంత్రము ఋగ్వేదమున యున్నది. వామదేవ ఋషి, తల్లి గర్భవాసమునుండి పలికిన వచనములందు గలవు.

ఈ మంత్రమువలన, వామదేవ ఋషి గర్భవాసమునసే, ఆత్మజ్ఞానము పొందెనని తెలియుచున్నది. కనుక, 'ఆత్మజ్ఞానము చతుర్విధ ఆశ్రమవాసములందు పొంద నగును, అను అభిప్రాయము సామాన్యవాదముగ యుందుండినను, జీవవికాసము పరిపక్వమగుటవలన, గర్భవాసమున కూడ పొంద సాధ్యమని తెలియు చున్నది.

వామదేవ ఋషి, తన స్వరూపము ఆత్మ ఎఱుక, యని గర్భవాసముననే తెలిసికొనెను. కనుక, ఈ పిండమునందు వృద్ధిపొందు కోశములు, అందలి ఇంద్రియములు, ఇంద్రియ వ్యవహారశక్తులు, క్రమముగ వృద్ధిపొంది, పూర్ణమానవ స్వరూప మేర్పడుట, అతడు సాక్షివలె చూడగలిగెను. తత్ఫలితముగ, "ఈ దేవతల జన్మములన్నియు నాకు తెలియును" అను చున్నాడు. దేవతలనగా, వ్యవహార శక్తులని మునుపే వివరించియున్నాము.

ఆ మహాఋషికి, ఆత్మజ్ఞానము కలిగినను, తన విశాలహృదయ వికాసమున, తానప్పుడు కొన్ని విషయమయ కోశములతో తాదాత్మ్యము పొందు చుండెననియు, అవి తనకు లోహమయ బంధములుగ నుండెననియు తెలుపుచున్నాడు. ఇందు వామదేవుడు విషయకోశములతో తాదాత్మ్యము పొందియుండుట ప్రశంసనీయము కాదు. అట్టి తాదాత్మ్యముల నతిక్ర మించి, వాటి బారినుండి తప్పించుకొని, వ్యవహరించ గలుగుట గొప్ప విశేషముగ నున్నది. ప్రతి జన్మమున, తనకు కలిగిన బంధనము లన్నిండి, డేగవలె వేగముగ ఎగిరిపోయి, తప్పించుకొని ఉన్నత అంతస్థుల చేరి ఆత్మస్వారాజ్య ప్రశాంతానుభవము పొందుచుండెను.

శ్రు॥ స ఏవం విద్వా నస్మా చ్ఛరీర భేదా దూర్ధ్వ ఉత్క్రమ్యాముష్మిన్ స్వర్గే లోకే సర్వా న్కామా నాప్త్వా మృతః సమభవత్ సమభవత్ [యథా స్థానం గర్భిణ్యః]॥ (6).

[అతడు - వామదేవ ఋషి - ఆత్మసాక్షాత్కారము పొంది, తన ఊర్ధ్వమార్గము ననుసరించెను. శరీర పతనానంతరము స్వర్గమున సర్వకోరికలు అనుభవించి, అమృతస్వరూపుడాయెను. (గర్భిణీ స్త్రీలు యథాస్థానమున ఆసీనులు కావచ్చును)].

ఐతరేయ మహాఋషి, వామదేవుల జీవిత విజయ వికాసమును తెలుపుటతో, ఈ ఖండము ముగియు చున్నది. ఆ ఋషి, ఆత్మానుభవము పొందుటతో, తన శరీర మనోబుద్ధులను త్యజించగలిగెను. ఆత్మ ఎఱుకవలన, శాశ్వత పరమపదవి పొందెను. "బ్రహ్మ నెఱిగినవాడు బ్రహ్మ యగుచున్నాడు" అను యుప నిషద్వాక్య మతిపరిచయముగ నున్నది. బంగారు నెఱిగిన గొలుసు బంగారగుచున్నది. మన్ను నెఱిగిన కుండ మన్నగుచున్నది. సముద్రము నెఱిగిన తరంగము సముద్రమగుచున్నది. ఆత్మ నెఱిగిన యహంకార మాత్మయగుచున్నది. జాగ్రదావస్థకు వచ్చిన వ్యక్తికి, స్వప్నసింహముయొక్క భయము తీరు చున్నది.

అందువలన, ఆత్మ నెఱిగిన వ్యక్తి మరల భ్రమలకు వశుడుకాడు. అసత్య తాదాత్మ్యము పొందుటలేదు. కనుకనే ఈ మంత్రమున "శరీర నాశమున కనంత రము" అని తెలుపబడినది. ఈ మాటలకు కొందరు వేదాంతులు, "సాధకుడు శరీరమరణము పొందిన వెనుక, అమృతత్వము ననుభవించును" అని వ్యాఖ్యా నము చేయుచున్నారు. శంకరు అట్టి తీర్మానమును, తర్కసమ్మతముగ రూపులేక చేయుచున్నాడు. ఆత్మానుభవము "ఇప్పుడే, ఇక్కడే" సాధ్యమని స్థిరపరచుచున్నాడు. అట్టి అనుభవము కలిగిన వెనుక,

అతడు జీవన్ముక్తి స్థితి యనబడు పవిత్రజీవితము ననుభవించుచున్నాడు. అదియే మోక్షపదవి. దైవీమానవ జీవితము.

ఈ మంత్రమునగల "శరీరభేదాత్" అను పదము వలన, శరీర సంపర్కము వీడగా — అనుటవలన, పై భావము స్పష్టమగుచున్నది. ఈ సంపర్కము వీడిపోవుటలు, స్థూలశరీరమునుండి, సూక్ష్మశరీరము ఉద్గమనము చేయుటవలన, కలుగు మరణము కాదు. శరీరమే సమేతఆత్మయని తలచుటయే ఆత్మమరపు, భ్రమ. ఇట్టి దుఃఖదాయక తాదాత్మ్యమునుండి తొలగి, స్వయంకృత భ్రమనుండి వెలువడుటను, శరీరభేదాత్ అని తెలుపబడినది.

సత్యజ్ఞానమువలన భ్రమలు తొలగును. ప్రకాశము ప్రవేశించినచోట చీకటి తొలగిపోవును. ఆత్మ ఎఱుక కలిగినవెనుక, ఆ పవిత్రవ్యక్తి శరీరము నంటగట్టుకొని యుండినను, శరీరాభిమాన మతనికి యుండదు. ఒక ధనవంతుడు తన మోటారు శకటములను, తన కార్యములకై ఉపయోగించుకొనునట్లు, అతడు తన శరీర మనోబుద్ధులను జీవితశేషమును గడపుటకు, రథమువలె యుపయోగించుచుండును.

అదేవిధముగ, శంకరులు, రామకృష్ణుడు, తమ మాంసమయశరీరమును, మనోబుద్ధులను, సమాజసేవ కొరకు ఉపయోగించిరి. కాని, అట్టి పరిపూర్ణులకు దేహాభిమానము లేదు. వారు ప్రకృతి నియామకులు, యజమానులు.

ఇట్టి శరీర తిరస్కారముతో కూడిన ఆత్మానుభవము పొందిన మహనీయులు, "అమృతస్వర్గమును చేరుదురు." అనగా, పరమపదవి ననుభవించుటవలన, వారి కోరికలు నిశ్శేషముగ తీరిపోవుచున్నవి. పరిపూర్ణ స్వస్వరూప జ్ఞానము తనందున కోరిక లుత్పన్నమగుచున్నవని ముందే వివరించియున్నాము. కోరికలనగా, కామము, కామమువలన ఆలోచనలు పుట్టును. ఆలోచనలు బహిర్గతము కాగా, వ్యక్తిగత కర్మలు కలుగుచున్నవి. ఆత్మవిద్యవలన, భ్రమలు తొలగుచున్నవి. భ్రమలు తొలగిన, కోరికలు పుట్టుట లేదు. "స్వర్గలోకమున యతని కోరికలన్నియు తృప్తి పొందుచున్నవి" అని మంత్రము తెలుపుట వలన, ముక్తిపొందిన వారిస్థితి తెలియుచున్నది. స్వర్గలోకమనగా, ఆత్మానుభవమువలన కలుగు పరిపూర్ణపదవి. అందు ఆత్మ ఆత్మను సందర్శించుచున్నాడు. అనగా, పరిపూర్ణము తప్ప భిన్నమేదియు లేదు. అదియే అమృతస్వరూపము.

ప్రకృతి అనుటలో, మృత్యువు కూడియున్నదని భావము. పరిమితికలది నాశము పొందవలయునను నియమమున్నది. సర్వవ్యాపకమగు సత్యమునకు పరివర్తనములు లేవు. కనుక అది అమృతస్వరూపము. వ్యక్తియందలి సత్యాంశము ప్రకృతిజన్య శరీరముతో ఐక్యము కల్పించికొనుటవలన, మృత్యువు కెంటంటుచున్నది. ఇట్టిభ్రమ తొలగగా, ఆత్మజ్ఞానమువలన, ఆత్మ అమృతత్వమును పొందుచున్నది. మృత్యువున కతీతముగ ఆత్మసామ్రాజ్యమున్నది.

[ఈ ఖండముయొక్క చివరన, మరొక నాటక విజ్ఞాపన కలదు. గర్భిణీ స్త్రీలు, యథాస్థానములందాసీనులు కావచ్చును. ఐతరేయ ఋషి తెలుపు ఉపనిషత్తునందు, కడపటి అధ్యాయమొకటి యున్నది. దానిని వారుకూడ ఆలకించవచ్చును - అని భావము- విశేషములు ముందు ప్రస్తావించియున్నాము.]

## 6 భాగము

### తృతీయోధ్యాయము - ప్రథమ ఖండము

శ్రు॥ కో௨యమాత్మేతి వయముపాస్మహే. కరతః స ఆత్మా యేన వా పశ్యతి, యేన వా శృణోతి, యేన వా గన్ధానాజిఘ్రతి, యేన వా వాచం వ్యాకరోతి, యేన వా స్వాదు చాస్వాదు చ విజానాతి॥ (1).

[మనము ఆత్మయని ఉపాసించుచున్నామే, అతడెవరు? కింటియందు ఆత్మ యేది? దేనివలన చూడగలుగుచున్నామో, దేనివలన వినగలుగుచున్నామో, దేనివలన ఆఘ్రాణించుచున్నామో, దేనివలన మాట్లాడగలుగుచున్నామో, దేనివలన స్వాదు, అస్వాదుల తెలిసికొనుచున్నామో, ఆ యాత్మ ఎవరు?]

ఈ ఖండములో, ఉపనిషత్ప్రవచనము చక్కగ సమాప్తియగుచున్నది. ఈ ఉపనిషద్భావమంతయు, పరిపూర్ణ బ్రహ్మాండముయొక్క వ్యక్తస్వరూపమును, వర్ణించి, తన్మూలమున, అవ్యక్త బ్రహ్మమును లక్షించుట యగుచున్నది. ఉపనిషత్తునందలి పూర్వభాగమునందు, విరాట్పురుషునియందు, వ్యక్తిస్వరూపము లెట్లు కలిగెనో, వాటియందు, ఇంద్రియముల క్షుత్పిపాస లెట్లేర్పడెనో, తెలుపబడినది. శరీర యుత్పత్తిక్రమము, శరీరనిర్మాణము, శిరమునందలి విదృతిద్వారా ఆత్మప్రవేశము, వామదేవ ఋషియొక్క ఆత్మాను

భవ వాక్యములు వర్ణింపబడెను. గర్భవాసమున వామదేవ ఋషి పొందిన అనుభవముల వర్ణనలవలన, శిష్యులు తమకు గల దురభిప్రాయములను తొలగించుకొని, సమ్యక్ జ్ఞానమువలన స్వస్వరూపజ్ఞానము పొందగలిగిరి.

ఆత్మాన్వేషణయందు ఇంతటి విపులము, సూక్ష్మము అగు విచారణ వినుటవలన, శిష్యుల యుత్సాహమతిశయించెను. ఆత్మను గురించి నూటిగ ప్రశ్నింప మొదలిడిరి. ఈ ఖండమునందు ఆత్మ ఉపాధిమూలమున వ్యవహరించుచున్నాడనుట, సోపాధికవర్ణనల ద్వారా తెలుపబడుచున్నది. పరబ్రహ్మము ఉపాధిరహితుడు గనుక నిరుపాధికుడనబడును. బల్బునందు కలుగు ప్రకాశము సోపాధిక విద్యుచ్ఛక్తి. తీగలందుండునది అవ్యక్త విద్యుచ్ఛక్తి నిరుపాధికమనబడును.

జీవుడు సోపాధిక ఆత్మ. పూర్ణజ్ఞానమువలన నిరుపాధిక పరమాత్మానుభవము కలుగును.

ఈ మంత్రమునందు, గురుశిష్యుల సంవాదము కలదు. శిష్యుడు తన సంశయముల నతి స్వల్పమాటలతో తెలుపుచున్నాడు. గురువు బోధనాశైలియందగ్రగణ్యుడగుటవలన, శిష్యుడు తెలిపిన వాక్యములందుగల అంతరార్థమును విపులముగ విస్తరించి, శిష్యునికి గలిగియుండు మూలాజ్ఞాన సంశయముల తొలగించుచున్నాడు.

"కోఽయం ? ఇది ఎవరు ?" శిష్యుడు ప్రశ్నించుచున్నాడు.

"ఆత్మ యనగా నేమి? ఈ ఆత్మ ఎవరు?" అతనితో సారూప్యమేర్పడుటవలన భ్రమలన్నియు తొలగును. అమృతపదవి సమకూడును. వామదేవ ఋషి అట్టి పదవిని పొందియున్నాడు.

"ఆత్మేతి వయముపాస్మహే" - అను నూటి యగు శిష్యుని ప్రశ్నకు, గురువు వివరము తెలుపుచున్నాడు. మీరు ప్రశ్నించుచుండు ఆత్మనుగూర్చి, ప్రశాంత అరణ్యములందు ఏకాంతమున మేము ధ్యానము చేయుదుము. ప్రపంచ విషయములనుండి విముఖులమై ఆ పరమాత్మ నుపాసింతుము.

ఇచ్చట ఉపాసన యనగ, దేవాలయమ్ములలో మనము సామాన్యముగ చూచుచుండు ఘోర కార్యములు కావు. నేటికాలమున ప్రపంచమునందు అన్ని మతములలో ఉపాసనలు నీచపదవి పొందియున్నవి. సత్యభావము, మర్యాద కోలుపోయినవి. గుణహీనుల చేయు భావములు, నిర్వీర్యపరచు, ఆత్మహత్యలనబడగల కార్యములు, ఆత్మసన్నిధానమున బిచ్చమెత్తుటగ మారిపోయినవి. శ్రుతులందిట్టి భావములతో ఉపాసనలు నిర్మింపబడలేదు

నిత్యనిరంతరము, శ్రద్ధాభక్తులతో పరమాత్మ ధ్యానము చేయుచుండుటవలన, మన నీచ మృగచేష్టలు తొలగి, పరిపూర్ణ ఉన్నతాశయములతో ఐక్యము కలిగించుకొని, ఉత్తమధ్యాన సాధన చేయుటను, ఉపాసన యనబడును. కనుక, గురువులు ఆత్మను గురించి, నిరంతరము ధ్యానించుచున్నారని శిష్యులకు తెలుపుటలో, ఆత్మోపాసన యనగ, అనిత్యముల యందుగల సంబంధముల నుపసంహరించుకొని, పరమాత్మయందు ధ్యానయుంచుట యగును.

కతరః స ఆత్మా – రెంటియందు ఆత్మయేది? మహాత్ములందరు ఆత్మనుగూర్చి ధ్యానించుచుందురు. ధ్యాన పరిపాకమువలన, వారు అసత్య భ్రమలనుండి, ఉపసంహరించుకొనుచున్నారు. ఇందు రెండాత్మల గురించి వినుచున్నాము. ఒకటి ఇంద్రియములకు దృశ్యము, అనుభవవేద్యముగ నున్నది. అదియే అహంకారము. రెండవది 'బుద్ధిగ్రాహ్యం అతీంద్రియం' అన్నారు. వీటిలో, మనము ధ్యానించి, అజ్ఞాన నివృత్తి, మోక్షప్రాప్తి పొందగల నిజమైన ఆత్మ ఏది? అని శ్రద్ధావంతులగు ఉపనిషత్ విచారపరులు ప్రశ్నించుచున్నారు – పై ప్రశ్నయొక్క సారమిది.

అందుకు, గురువు స్పష్టముగ వుత్తరమిచ్చుచున్నాడు. సత్యపరమాత్మ చైతన్యస్వరూపము. జ్ఞాన ఎఱుక – అన్ని స్పర్శలకు, వ్యవహారములకు మూలాధారము. ఇందుకు సాటి, బల్బునందుండు సన్నని వెంట్రుకవంటి తీగను ప్రకాశింపజేయునది విద్యుచ్ఛక్తి పంకాయందు చక్రమును త్రిప్పి గదియందు వాయుచలనము కలిగించునది విద్యుచ్ఛక్తి. లోహగొట్టమున పారి, వంటపాకములకు వుష్ణము కలిగించునది విద్యుచ్ఛక్తి. అయినను, విద్యుచ్ఛక్తి యనగా ప్రకాశము కాదు. వాయువు కాదు. ఉష్ణము కాదు. కాని ఈ శక్తులెల్ల, వివిధ పరికరములద్వారా విద్యుచ్ఛక్తి పారుటవలన, కనబడుచున్నవి విద్యుచ్ఛక్తి పారకపోయినచో, ఆ పరికరములందెట్టి శక్తులు కనబడుటలేదు. అదేవిధముగ, నిజమగు ఆత్మను, ఆత్మప్రకాశమువలన, శిష్యులెల్ల తెలియవలెనని, గురువు బోధించుచున్నాడు.

(సశేషము)

# సీతారామము

శ్రీమతి లీలాకుమారి



## రంగము 1

[ప్రదేశము అయోధ్యా నగరమందలి రాణీవాసము. మహారాణి సీతాదేవి కూర్చుని ప్రత్యేక సౌందర్యము తిలకించుచుండును.]

(ప్రవేశము శ్రీరామచంద్రమూర్తి)

రాము:- దేవీ! జానకీ, తదేకదీక్షతో దేనిని పరీక్షించుచున్నావు?

జానకి:-(లేచి) ఆర్యపుత్రులకు సుస్వాగతము. నాథా, సంధ్యాసమయ ప్రకృతి ఎంతో ఆకర్షణీయము గదా!

రాము:- వైదేహీ, సత్యము బల్కితివి. అటు చూడుము. అస్తమయ దినకరుని అరుణ కిరణజాలముల శోభ. ఇదిగో ఇటు చూడుము. పక్షులు కిలకిలారవంబులతో తమతమ కువలయంబులను ఎట్లు జేరుచున్నవో!

జానకి:- నాథా, ఈ ప్రకృతికి ఇంతటి సౌందర్యమును చేకూర్చిన విధాతను ఏమని నుతింపదగునో గదా.

రాము:- మైథిలీ, ప్రకృతి మాధుర్యమును మించిన సౌందర్యము ఒకచో కలదు సుమా!

జానకి: (ఆతురతతో) నాథా, ఎచ్చట కలదు?

రాము:-(చిరునవ్వుతో) దేవీ, నీ సుందర వదనారవిందమునందు.

జానకి:-(సిగ్గుతో) కేవలము నాయందు ప్రీతిచే అట్లనుచుండిరి.

రాము:- దేవీ, నేనసత్యము వచించుటలేదు సుమా. ఈ ప్రకృతి సౌందర్యమంతయూ ఒకచో జేరిననూ నీ మనోమోహనమూర్తి తులతూగుట దుర్లభము.

జానకి:-(ప్రసంగము మార్చుచు) ప్రాణేశ్వరా, అటు జూడుడు. పాపమా కూలివాళ్ళు ఎట్లు కష్టపడి పనిచేయుచున్నారో!

రాము:- సీతా, అచ్చట ఒక మందిరము నిర్మింప నేనే ఆజ్ఞాపించితిని.

జానకి:- అయ్యో! వారి కష్టము చూచుచున్నకొలది నా హృదయము ద్రవించుచున్నది.

రాము:- దేవీ, నీ హృదయము నవనీత సదృశము.

జానకి: చూడుడు. కష్టపడుచున్న కొలది క్షణక్షణమున నుదయించుచున్న స్వేద బిందువులను ఎట్లు తుడుచుకొనుచున్నారో నాథా వీరి శ్రమను చూడజాలకున్నాను. దీనికి నివారణోపాయము లేదా?

రాము:- జానకీ, అది వారి వృత్తి. ఎవరి వృత్తి ధర్మమును వారు నిర్వహించవలెను.

జానకి:- అనగా?

రాము:- అనగా ఎవరి జాతి ధర్మమును

వారు అనుసరించవలెను. పరధర్మ స్వీకరణ పాపము.

జానకి:- దేవా, పరధర్మ స్వీకరణ విషయమునుగూర్చి నేను వచించుటలేదు. కేవలము వారిచే ఈ వృత్తిని మాన్పించ ప్రార్థన.

రామ:-(ఆశ్చర్యముతో) రమణీ. ఇది ఏమి విపరీతమగు కోరిక ? ఇది సాఫల్యము ఎట్లు నొందును.

జానకి:-తమ కసాధ్యమైన కార్యము గలదా ?

రామ: నీ ఉద్దేశమును స్పష్టపరచుము.

జానకి: నాథా, మన రాజ్యమునందలి సకల జనులు సుఖము ననుభవించుచున్నారు. అనాథలకు శరణాలయములు కట్టించిరి పేదజనంబులకు ధర్మసత్రములు నిర్మించిరి. ఈ కూలిజనము మాత్రమేల ఈ కష్టము ననుభవించవలెను ?

రామ:-(తనలో) అహా ! ఈమె ముగ్ధత్వమునకు చింత గల్గుచున్నది. ఇపుడీ కోరిక నిరాకరించిన ఈమె దుఃఖించును. ఈమె అజ్ఞాన తెరను దొలగించుటకు ఇదియే మంచి తరుణము.

(ప్రకాశముగా) దేవీ ! వీరి కష్ట నివారణోపాయము నీవే వచింపుము.

సీత:- వీరి భుక్తికొరకును, నివాసము కొరకును తగిన సదుపాయము గల్పించిన ఇక వారు కాయకష్టముచేసి జీవించవలసిన అవసరము తీరును.

రామ:- దేవీ, నీ ఇచ్ఛానుసారమె జరుగును.

రంగము 2

(సీతాదేవి సఖీపరివృతయై యుండును)

సీత:-శ్రీలేఖా, ఈ దినమున ఆర్యపుత్రులు ఇంకనూ అరుదెంచలేదేమి ? ఈ ఆలస్యమునకు కారణమనూహ్యముగా నున్నది.

శ్రీలేఖ:- మహారాణీ, మహారాజు రాజకీయ కార్యతత్పరులై యుందురని తోచుచున్నది. ఒక క్షణము ఆలస్యమైననూ తమ చిత్తమూ విరహమును సహింపలేకున్నదే.

సీత -నీవు నా ఉద్దేశమును గ్రహింపలేకుంటివి. ఆర్యపుత్రులు నా ప్రార్థనపై ఒకానొక కార్యార్థమై ఏగియున్నారు.

(ప్రవేశము పరిచారిక)

పరిచారిక: దేవీ, మహారాజు విచ్చేసి యున్నారు.

(శ్రీలేఖ దాసితో నిష్క్రమించును)

(ప్రవేశము శ్రీరాముడు)

(సీత లేచును)

శ్రీరామ: జానకీ, నీ వాంఛ నెరవేరినది. మన రాజ్యమునందలి కూలిజనంబుకు తగిన వసతులు, ధనము ఇవ్వబడినది. ఇక వారి జీవయాత్ర సుఖముగా గడిచి పోగలదు.

సీత:-(సంతోషముతో) ఇప్పటికి నా హృదయ వేదన ఉపశమించినది.

శ్రీరామ:- దేవీ, అవసరమగు రాజకీయములున్నవి. పోయి వచ్చెద.

సీత:-చిత్తము.

(శ్రీరాముడు నిష్క్రమించును)

(ప్రవేశము ఊర్మిళ, మాళవి, శ్రుతకీర్తి)

ఊర్మిళ:- సోదరీ జానకి బావగారితో ఏదో అవసరమగు విషయమును గూర్చి చర్చించుచున్నట్లున్నదే ?

సీత -ఔను. నా ప్రార్థనపై వారు ఒక కార్యము నిర్వర్తించిరి.

మాళవి:-నీ ప్రార్థనానుసారమా? అక్కా, నీ మాటలు నా కర్థమగుటలేదు.

సీత:-(మందహాసముతో) మనరాజ్యములో కొందరు కూలిజనంబు కష్టపడుట జూచి నా మనసు వ్యాకులమైపోయినది. వెంటనే ఆర్యపుత్రులకు వారి విషయమై తగినశ్రద్ధ జూపింప ప్రార్థించితిని. కాయకష్టముచేసి జీవించుచున్న కూలిజనమునకు ధనము, వసతి, చేకూర్చ ఆజ్ఞ ఒసంగబడినది. ధనము కొరకే గదా వారు ఇట్టిపనులు జేయుచున్నారు? ఇక కూలిచేసి జీవించవలసిన అవసరము వారికి తీరిపోయినది.

శ్రుతకీర్తి: (ఆశ్చర్యముతో) సోదరీ, ఇటువంటి విపరీత కోరిక నీకెట్లు కలిగినది?

సీత:-ఇందు విపరీత మేమున్నది?

శ్రుతకీర్తి:-విపరీతము గాదా? కూలి జనంబు లేకున్న జరుగుటెట్లు. గృహ నిర్మాణాది కార్యములు నిర్వహింపబడుటెట్లు?

మాళవి:-సోదరీ, అందరూ సమానత్వము పొందిన ఎట్లు గడచును. ఎవరి కుల వృత్తి వారు నిర్వర్తించవలెను.

సీత -(తెల్లబోయి చూచును.)

(తొందరగా శ్రీలేఖ ప్రవేశించి)

శ్రీలేఖ:-దేవీ, విలాసమందిరము ఇప్పుడే పెద్ద ధ్వనితో కూలిపోయినది.

సీత:-అయ్యో, ఎంతటి దుర్వార్త!

ఊర్మిళ:-విలాసమందిరము అతి ప్రాచీనపు కట్టడము. అది పడిపోవుటలో ఆశ్చర్యమేమియును లేదు. మొన్న వర్షము విపరీతముగా కురియుటచే బాగా నాని యుండును.

సీత: దాని పునర్నిర్మాణము కొరకు ఆర్యపుత్రులను ప్రార్థింప సంకల్పించితిని. మాళవీ, ఏమందువు?

మాళవి:-నీ సంకల్పము సిద్ధించుగాక. కాని సోదరీ, నీ కృపావిశేషముచే కూలి జనంబు సుఖులై, ధనవంతులై యున్నారుగదా. మరి విలాసమందిర పునర్నిర్మాణము ఎట్లు జరుగును?

(ప్రవేశము పరిచారిక)

పరిచారిక:-దేవీ, మహారాజు విచ్చేయుచున్నారు.

(అందరు నిష్క్రమింతురు)

(ప్రవేశము శ్రీరాముడు)

శ్రీరామ:-(విచారముతో) దేవీ విలాస మందిరము కూలిపోయినదని తెలియ వచ్చినది.

సీత:-నాథా ఆ వార్త నేను గూడ విన్నాను. దాని పునర్నిర్మాణము గురించి తమరు యోచింపలేదా!

శ్రీరామ:-ఆ విషయమును ప్రస్తావించుటకే వచ్చితిని.

సీత: అటులైన ధన్యను. నాథా, త్వరలో విలాసమందిర నిర్మాణము ప్రారంభింప ఆజ్ఞ ఒసంగుడని ప్రార్థితులు.

శ్రీరామ: మైథిలీ, అటులనే జరుగును. ఇపుడే వలయు ఏర్పాటు గావింప ఆజ్ఞాపించెదను.

సీత:-చిత్తము.

[ తెర పడును ]

రంగము 3

(సీతాదేవి ఆసీనయైయుండ శ్రీరాముడు ప్రవేశించి)

శ్రీరామ:_జానకీ, వింటివా. విలాసమందిర నిర్మాణమునకు కూలిజనంబు దొరుకలేదు.

సీత:-(తనలో) హా! పరమేశ్వరా! మాళవి వచించిన మాటలు సత్యములా? (ప్రకాశముగా) ప్రాణేశ్వరా! కారణమేమి?

శ్రీరామ:-ఆ వృత్తియందుండినవారు నీ దయచే సుఖముగా జీవయాత్ర గడుపుచున్నారు. ఇక వారు కాయకష్టము చేసి జీవించవలసిన అవసరములేదు. కావున పనిలోనికి వచ్చుట నిరాకరించిరట. చూచితివా వారి అహంకారము. ఎవరివలన ఈ సంపదలు వచ్చినవో ఇంతలోనే మరచిపోయిరి. విశ్వాసఘాతకులు. అదియునుగాక తమకు కూలిజనంబు దొరుకుటలేదని పురజనులు మొరబెట్టుకొనుచున్నారు.

సీత:-ప్రభూ, ఇట్లు జరుగునని స్వప్నమునందైనా తలుపనైతిని. ఇది అంతయూ నా స్వయంకృతాపరాధము.

శ్రీరామ:-(బుజ్జగింపుచు) వైదేహీ, చింతింపవలదు. గతజలసేతుబంధన మేల? ఇకముందు జరుగవలసిన కార్యమును యోచింపదగును. కాంతా, ఎన్నటికి అల్పులకు అధికారమివ్వరాదు. మధ్యలో ఐశ్వర్యము లభించినంతనే గర్వాంధులై పోవుదురు. ఎవరికి తగినచోట వారిని వుంచవలెను. స్వధర్మ విస్మరణ విషమ పరిణామములకు భగవంతుని సృష్టికి మనము వ్యతిరేకముగా చేయుట వెర్రితనము. పూర్వజన్మకర్మ ఫలానుసారముగా ఆ వ్యక్తులు జన్మించి కష్టసుఖములనుభవించెదరు.



భగవంతుడు లిఖించిన విధముగా జరుగవలసినదే. దానిని మార్చుటకు ఎవరి సాధ్యముగాదు. ఒక పేదవానిని జూచి జాలిపడి ధనవంతునిగా జేయవచ్చునుగాని కర్మను మార్చుట ఎవరి తరము. జానకీ, నీవు విచారపడవలదు. నేనంతయు చక్కబెట్టెదను.

సీత:-తమ అభిప్రాయము తెలుప ప్రార్థన.

శ్రీరామ:_రమణీ, వారికిచ్చిన సంపదలు, గృహములు తిరిగి సంస్థానమునకే స్వాధీనములగును. ఇక వారు ఎప్పటివలె స్వధర్మమును పాటించి వృత్తిని సాగించెదరు. చెలీ! నీ అజ్ఞానమును తొలగించుటకే ఇట్లు చేసితిని. ఇపుడు నీవు సత్యమును గ్రహించితివి. ఇక త్వరలోనే నీ విలాసమందిరము గాంచగలవు.

సీత:-చిత్తము.

(తెర)

---

# మమతా - మనసూ

శ్రీ కానాదిభట్ల సుబ్బారావు

పౌర్ణమి చంద్రుడు చల్లని కిరణాలను ప్రసరింప జేస్తూ ఆకాశంలో పచార్లు చేస్తున్నాడు. తారలు మిణుకుమిణుకుమని నవ్వుకుంటున్నాయ్. ఆ చల్లని వెన్నెల్లో ఒక బాలుడూ, బాలికా ఇసుకగూళ్ళు కట్టుకొని కేరింతలు కొడుతూ ఆడుకుంటున్నారు. వాళ్ళలా ఎంతోసేపు ఆడుకున్నారు, పాడుకున్నారు.

ఇంతలో ఆ బాలిక "బావా! ప్రొద్దుక్రుంకి చాలసేపయింది. అమ్మ కొడుతుందేమో వెళదాం పద" అంది.

ఇంక నయం అరుంధతీ! గుర్తుచేశావ్. లేకపోతే ఎంచక్కా ఆడుకునేవాళ్ళం అన్నాడు.

నీ వేళాకోళం కేంగాని పద మధూ! అంది.

ఇద్దరూ పరుగెత్తుకుంటూ వెన్నెల్లో ముందుకు పరుగెత్తారు.

ఎక్కడికి పోయారే యింతసేపటిదాకానూ. నీళ్ళోసుకోవాలని గుర్తులేదా - అని గద్దించింది ఇంటికిరాగానే.

కిక్కురుమనకుండా పోసుకున్నారు. నీళ్లోసుకొని భోజనంచేశారు. ఆ తర్వాత పుస్తకాలు ముందరేసుకు, కూర్చున్నారేగాని చదువుమీద ధ్యాసేలేదు. నిద్దర తూలిపోతూంది. ఇంతలో అరుంధతి తూలి పుస్తకం మీద పడింది.

ఇదిగో అరూ! నిద్దరపోతున్నావ్. అత్తయ్యతో చెపుతానని గద్దించాడు మధు.

సరే చెప్పు చూద్దాం. మొన్న గోలీలాడిన సంగతి చెప్పనా ఏవిటీ అని వెక్కిరించింది అరుంధతి. మధు కిక్కుమనలేదు. ఇంతలో అరుంధతినాన్న రావటం చూసి గప్‌చుప్‌గా పాఠాలు చదవటం సాగించారు.

◆ ◆ ◆

అరుంధతీ, మధులు మేనమామ మేనత్త బిడ్డలు. మధు చూడటానికి చాలా అందంగా వుంటాడు. కలువపువ్వుల్లాంటి కళ్ళతో సంపెంగ పూవులాటి నాసికతో ఎంతో నాజూగ్గానూ, అందంగానూ వుంటాడు. ఇక అరుంధతి మాట చెప్పేదేమిటి? కుందనపు బొమ్మ. కోటేరేసిన ముక్కుతో మల్లెపువ్వుల్లాంటి కళ్ళతో ముద్దొచ్చినట్లు కనపడుతుంది.

మధు స్వంతవూరు పల్లటూరే అయినా మేనమామ బలవంతంచేసి తన యింట్లోనే వుంచుకొని చదువు చెప్పిస్తున్నాడు. ఎప్పటికయినా మధు వాళ్ళింటి అల్లుడే కదా అనుకుని మాట్లాడలేదు.

ఇల్లా కాలం గడిచిపోతూంది. వీధిబడి చదువయిపోయింది. యిద్దరూ హైస్కూల్లో చేరారు. కష్టపడి చదువుతూ ప్రతి సంవత్సరమూ మంచి మార్కులతో ప్యాసయ్యేవాళ్లు.

రోజులు గడిచిపోతున్నాయ్. ఇద్దరూ స్కూలు ఫైనలు ప్యాసయ్యారు.

మధును కాలేజీలో చేర్చారు. అరుంధతి కూడా కాలేజీలో చేరుతానని పట్టుబట్టి కూర్చుంది. అయితే ఆమె తల్లిదండ్రులకు యిది యిష్టంలేదు. ఆడపిల్లకు కాలేజీ చదువెందుకులే అనే భావంలో వున్నారు.

"ఐనా ఆడపిల్లలు చదివి వూళ్ళేలటానికా, వుద్యోగాలు చేయటానికా?" ఈ భావంలో వుంది అరుంధతి తల్లి.

తండ్రి కూడా ఏమీ మాట్లాడలేదు.

నీకెందుకులేమ్మా చదువు. కాలేజీ చదువులు ఆడపిల్లల కెందుకు చెప్పు. ఏదో చదువుకున్నావు చాలు. అయినా యిద్దరికి బస్తీలో ఖర్చు భరించాలంటే మాటలా చెప్పు. బావ చదువుకుంటే నువ్వు చదువుకున్నట్లేగా. రేపు బావ పెద్దచదువు చదువుకుంటే పెద్ద వుద్యోగం చేస్తాడు. అప్పుడు మీ యిద్దరూ...

అరుంధతి సిగ్గుతో అవతలకు వెళ్ళింది.

ఇప్పుడేకాని సిగ్గు. పెళ్ళయి నలుగురు పిల్లలు పుట్టిన తర్వాత అన్నీ పోతయి అంది నవ్వుతూ తల్లి.

ఊరుకో అమ్మా అంది నునుసిగ్గుతో అరుంధతి.

ఫస్టు టరమ్ గడిచిపోయింది. ఒకనాడు మధు రూముకు రాగానే ఒక వుత్తరం పడివుంది. కవరు చింపి చూశాడు. అది అరుంధతి వ్రాసింది. చదివి నవ్వుకున్నాడు.

ప్రియమైన బావకు నమస్కారాలు

నీవు కాలేజీలో చేరిన దగ్గరనుండీ వుత్తరాలు

వ్రాయటమే మానుకున్నావు. నన్ను మరిచిపోయావా బావా. వెంటనే జాబు వ్రాస్తావనీ ప్రతీక్షణం నీ జవాబుకోసం ఎదురుచూసే

నీ అరుంధతి

"ఎంత పిచ్చిదానివి అరూ. అంత నమ్మకం లేకపోతే ఎల్లా. నిన్ను మరిచిపోవటం సంభవమా చెప్పు. మనసులు పంచుకొని, వ్యక్తిత్వం తెలిసిన దగ్గరనుండీ ప్రేమించుకున్న మనల్ని విడదీయటానికి విధికయినా మనసు ఒప్పదు. నా మాట నమ్ముతావు కదూ. నీ జవాబుకోసం అనుక్షణం ఎదురుచూసే

నీ "మధు"

ఉత్తరం వ్రాసి తనలో తాను నవ్వుకున్నాడు. అరుంధతి వ్రాసిన ఉత్తరం పదేపదే చదువుకున్నాడు. తను వ్రాసిన ఉత్తరం పదిసార్లు చదువుకున్నాడు. గబగబా పోస్టాఫీసుకు వెళ్ళి ఎక్స్‌ప్రెస్ - డెలివరీ చేశాడు.

ఆ సాయంత్రం మధు కేమీ తోచలేదు. స్నేహితులతో ఏదో హాస్కు దంచుతూ కూర్చున్నాడే కాని కాలం గడవటంలేదు. సరే స్నానంచేసి దుస్తులు మార్చుకుని సినిమా హాలువైపు దారితీశాడు.

లోపలకు వెళ్ళేటప్పటికి పిక్చర్ బిగిన్ చేశారు. జనం క్రిక్కిరిసి వుండటంవల్ల స్థలం దొరకలేదు. అల్లాగే ఒదిగి ఓ మూల నుంచున్నాడు. సప్లయిరను పిలిచి ఒక కుర్చీ తెమ్మని చెబుదామనుకున్నాడు కాని వాడెక్కడా కనిపించలేదు. రూపాయిన్నర టిక్కెట్టు తీసుకొని యిదేం ఖర్మరా బాబూ అని విసుగెత్తాడు. చచ్చినా యిక ఫస్టు డే నాడు రాకూడదనుకున్నాడు.

ఇంతలో ప్రక్కనే కూర్చున్న ఒకావిడ కుర్రాడిని తీసి యీ కుర్చీలో కూర్చోండి అంది.

థాంక్సు అని కూర్చున్నాడు.

ఇంటర్‌వెల్ అయింది. లైట్లు వెలిగాయి. ఆ వెలుగులో ప్రక్క కూర్చున్న స్త్రీని చూశాడు. ఆశ్చర్యం! ఆమె మధు క్లాస్‌మేటు.

మీరు మా కాలేజీలోనే కదూ చదువుతున్నారు అన్నాడు.

అవును అంది.

ఆ అబ్బాయి మీ కుమారుడా అన్నాడు.

ఆమె పకపకా నవ్వింది. ఆ నవ్వులో లైట్ల వెలుగులో ఆమె పెదాలకు పూసుకున్న లిప్‌స్టిక్ పౌడర్ తళుక్కుమని మెరిసింది.

వీడు నా తమ్ముడులెండి. పిక్చరుకు వెళదామని ఒకటే పోరుచేస్తుంటే భరించలేక తీసుకొచ్చాను. ఫస్టు డే నాడు రావటం మహాబోరింగుగా వుందండీ అంది.

'అవునండీ. వెధవ రష్. ఇంతకూ మీ పేరేమిటన్నారూ?

'కళ' అంది.

ఇంతలో దీపాలు ఆరిపోయి పిక్చర్ బిగినయింది. పిక్చరు చూస్తున్నాడేకాని మనసంతా కళ మీదనే వుంది. అబ్బ! ఎంత అందంగా వుంది అని అనుకున్నాడు.

ఇంటికి వచ్చి పడుకున్నాడేకాని నిద్దరపట్టి చావలేదు. ఎంతసేపూ కళే మనోఫలకంముందు ప్రత్యక్షమయ్యేది. ఏమిటో కలలు. తానామెను పెళ్లి చేసుకున్నట్లూ, ఇద్దరూ కబుర్లాడుకుంటున్నట్లూ ఒకటే కలలు. ఎల్లాగో తెల్లవారుఝామున నిద్రపట్టేసరికి బ్రహ్మప్రళయమయింది. మధుకు నిద్ర అరగంట, కలలు రెండు గంటలు.

మర్నాడు క్లాసుకు వెళ్ళాడు. కళవైపు చూపే కాని పాఠంవైపు చూపేలేదు. 'కళ' యీవలోపడి అరుంధతిని మరిచిపోయాడు. ఆమె వ్రాసిన వుత్తరాలకు జవాబులు వ్రాయటం మానుకున్నాడు. 'కళ' ప్రాపుకోసం వెనుకులాడసాగాడు.

ఎల్లాగో కళతో స్నేహం అలవరచుకున్నాడు. ఇద్దరూ సినిమాలకూ, షికార్లకూ తిరగటం ప్రారంభించారు. వాళ్ళ స్నేహం చివరకు మరచిపోనంత గాఢంగా తయారయింది.

ఒకనాడు గోదావరి నది ఒడ్డున యిద్దరూ కూర్చున్నారు. ఏవేవో లోకాభిరామాయణం కబుర్లు చెప్పుకున్నారు. ఇంతలో మధు అన్నాడు. కళా! నేనొక్క మాట చెపుతాను వింటావూ?

ఏమిటది అంది కనుబొమలు కుంచిస్తూ. అతడు 'కళ' కళ్ళల్లోకి దీనంగా చూస్తూ మనిద్దరి వివాహం నీకు సమ్మతమేనా కళా! అన్నాడు.

ఆమె అదిరిపడి వెనక్కు జరిగింది. ఇదా నీతో స్నేహం చేసినందుకు ఫలితం అంది.

కాదు కళా. యిది నా జీవితంమీద ప్రశ్న.

అవును మధూ! నీవు అడిగిన ప్రశ్నకూడా నా జీవితానికి సంబంధించిందే.

నిన్ను మనస్ఫూర్తిగా ప్రేమిస్తున్నాను.

ఈ ప్రేమ ఎంతసేపు మధూ. ఇదంతా స్నేహం వల్ల కలిసిన ప్రేమేకాని మనస్సులోనుంచి వచ్చిన

ప్రేమ కాదుగా. స్త్రీ పురుషుడితో కలిసి తిరగటం వల్ల వచ్చే ప్రమాదం యిదే. పురుషుడు మంచి చెడులు ఆలోచించకుండా మాట ముందనేస్తాడు. స్త్రీ అల్లా అనదు. ఎందుకంటే అది ఆమె జీవితాంతంవరకూ సంబంధించిన సమస్య. మంచిచేసినా చెడుచేసినా పురుషుడు నలుగురిలోనూ తలెత్తుకుని తిరగగలడు. స్త్రీ అల్లా వుండడానికి సంఘంలో అవకాశం కలుగజేయబడలేదు. నలుగురూ ఆడదాన్నే దుమ్మెత్తిపోస్తారు కాని మగవాడు చేసిన కృత్యాన్ని మాటవరసకయినా లేకపోగా మంచిదని సమర్థిస్తారు అంది.

అయితే నన్ను అపార్థం చేసుకున్నావా కళా.

లేదు మధూ. మగవాళ్ళ మనసులు అల్లా వుంటవని చెప్పాను అంతే.

అయితే నన్ను ...

పెళ్లి చేసుకోవటానికి నా అభ్యంతరంలేదు. ఐతే మనిద్దరం భిన్నమతస్తులం. నీ కులానికీ మా కులానికీ ఏమాత్రం సంబంధమూలేదు. క్రిష్టియన్ స్త్రీని పెళ్లాడేటానికి మీవాళ్లు ఒప్పుకుంటారూ అంది.

ఒప్పుకుంటే ఒప్పుకుంటారు. లేకపోతే మనిద్దరం రిజిష్టరు మారేజి చేసుకుని వుద్యోగం చేసుకుని బ్రతుకుదాం అన్నాడు. ఈ మాటమీద నిలబడితే మన సంఘసంస్కర్తల ఆశయాలు నిజమవుతయి అంది.

నిజంగా కళా !

ఇది మన అదృష్టం అంది.

మధు దగ్గరగా జరిగి భుజంమీద చెయ్యివేశాడు. ఆమె గభాలున వెనక్కు వెళ్ళి - రిజిష్టారు ఆఫీసులో ఆమోదపత్రంమీద సంతకం చేసేటంతవరకూ రెండు గజాల దూరంలోవుండి మాట్లాడవలసిందే అంది.

ఆహా ! నేను...

ఆహాలేదు. గీహాలేదు. ముందు మీ Parents permission తీసుకుని రండి అంది.

అవశ్యం అని వెళ్ళిపోయాడు రూముకు రూముకు వెళ్ళగానే అరుంధతి వ్రాసిన వుత్తరం కనపడింది. Careless గా వుత్తరాన్ని చదివి పారేశాడు.

"కళ ! నిజంగా నా జీవితకళ !" అని బెడ్డింగు మీద పడిపోయాడు.

మర్నాడు తండ్రి దగ్గరనుంచి వుత్తరం వచ్చింది. త్వరలో మధుకు పెళ్ళిచేయబోతున్నామని వ్రాసిన వుత్తరమది.

వెంటనే మధు తన అనంగీకారాన్ని తెలియజేస్తూ వుత్తరం వ్రాశాడు.

మర్నాడే యింటికి బయలుదేరాడు. ఇంటికి రాగానే మధును తల్లీ తండ్రీ నానాచీవాట్లు పెట్టారు. తప్పకుండా అరుంధతిని పెళ్లాడాలని పట్టుబట్టారు. మధు తను ప్రేమించిన 'కళ' విషయం చెప్పి ఆమెను తప్ప ఎవ్వరినీ చేసుకోననీ, లేకపోతే జీవితాంతం బ్రహ్మచారిగా వుంటాననీ మొండిపట్టు పట్టాడు.

చూశావూ ! కాలేజీలో చేరితే జరిగే ఫలితము యిదే. ఏదయినా వుద్యోగంలో ప్రవేశపెడితే బాగుంటుందని నేనంటే నా మాట విన్నావూ. పట్టుపట్టి కాలేజీలో చేర్పిస్తివి. యిక ఏడవండి అన్నాడు భార్యమీద కారాలూ మిరియాలూ నూరుతూ.

నేనేం చేశానివిటి. ఇలా జరుగుతుందనుకున్నానా అంది భార్య.

ఒరేయ్! అబ్బాయ్! అరుంధతిని చేసుకో. చిన్నప్పటినుంచీ కలిసిమెలిసి తిరిగారు కదూ. నిన్నటిదాకా చేసుకుంటున్నానని యిప్పుడు వద్దంటున్నావూ. క్రిష్టియన్ స్త్రీని పెళ్ళి చేసుకుని కులం మంట కలుపుదామనా ? అక్కేమీ కుదరవు. అరుంధతిని చేసుకుతీరాలిసిందే.

చేసుకోను అన్నాడు.

ఆ క్రిష్టియన్ దాన్ని చేసుకుంటే యీ కొంపలో అడుగెట్టటానికి వీల్లేదు.

సరే అల్లాగయితే అని బెడ్డింగు తీసుకుని రాజమండ్రి బయలుదేరాడు.

ఇంతలో మధు మేనమామా, మేనత్తా, అరుంధతీ బండి దిగారు. మధు అరుంధతివైపు చూడలేదు. మామను పలకరించలేదు. ముఖాభావంగా కూరుకున్నాడు.

వాళ్లు కదుక్కున్న తర్వాత మధు మామ పెళ్ళి విషయం ఎత్తాడు.

అరుంధతిని చేసుకోనని గట్టిగా చెప్పాడు. మేనమామ విస్తుపోయాడు. అరుంధతి కళ్ళవెంట జలజలా కన్నీళ్ళు పొర్లినై !

ఇంతేనా మధూ ! అన్నాడు మేనమామ.

మధూ ! చిన్ననాటినుంచీ మా యింట్లో చదువుకున్నావు. ఇంతేనా నీ విశ్వాసం - అంది మేనత్త.

అరుంధతి మాత్రం దిగాలుపడి బావవైపు చూస్తూ కళ్ళవెంట నీళ్ళు కారుస్తున్నది.

నాకవ్వన్నీ తెలీవు. నేను చేసుకోను. అంతే _ అన్నాడు.

అల్లా అయితే నా యింట్లోనుండి వెళ్ళిపో అన్నాడు తండ్రి.

మధు చరచరా బయటకు నడిచాడు ఎవ్వరిమాట లెక్క చేయకుండా.

కాలేజీకి వచ్చాడేకాని మనసులో మనసులేదు. రెండు రోజులు కాలేజీకి వెళ్ళలేదు. 'కళ'కు కన పడటమే మానేశాడు. ఎందుకంటే తన తల్లిదండ్రులు అంగీకరించకపోవటంమూలాన ఏమంటుందోనని.

పదిహేను రోజులనంతరం పార్కులో కలిసింది కళ. కళ మధును మాట్లాడించలేదు. అతనే పలుక రించాడు. కళ మండిపడింది. మీ మగవాళ్ళంతా యింతే. మొదటనే చెప్పాను. మగవారి మాటలు నీటిమూటలని. అందుకనే జాగ్రత్తపడ్డాను. నీవు ఏ నాడయితే నేను కనపడినా మాట్లాడించకుండా ముఖాభావంగా వూరుకున్నావో ఆనాడే గ్రహిం చాను నీ విషయమంతా. నమ్మించి నన్ను నాశనం చేయదలిచావా మూర్ఖుడా - అంది కోపంగా.

లేదు కళా నా మాట.

నీ మాట యిక వినదలచలేదు. ఇష్టమయితే నా భర్తను చూడటానికి రా. అతడు నీకంటె వేయిరెట్లు ఎల్లా మెరుగో చూద్దువుగాని అంది.

నీవు పెళ్ళి చేసుకున్నావా అన్నాడాశ్చర్యంగా.

నీ ప్రేమకోసం తపిస్తూ కూర్చుంటే ఏడిచేదాన్నే.

నీ ముఖాభావాన్ని చూచి కనిపెట్టే అతన్ని అంగీకరించాను అంది.

మధు మాట్లాడలేదు. మనసులో పెనవేసుకున్న దుఃఖం పొంగి పొర్లింది. గిరుక్కున వెనక్కు తిరి గాడు.

అటు కోరివరించిన అరుంధతిని తిరస్కరించాను. ఇటు 'కళ'ను దక్కించుకోలేకపోయాను. రెంటికీ చెడిన రేవడిని. నా అరూ నన్ను క్షమిస్తుందా అని పరిపరివిధాల పరితపిస్తూ కన్నీళ్ళతో దిండును ముద్ద చేశాడు.

నిన్ను అన్యాయం చేశాను. అరూ! దేవుడు నన్నే శిక్షించాడు. నా పాపానికి ప్రాయశ్చిత్తం అనుభ విస్తున్నాను అని ఏడ్చాడు

♦ ♦ ♦

అరూ! నన్ను క్షమిస్తావూ. నీకు అన్యాయం చేయాలని తలపెట్టిన నాకు దేవుడే ప్రాయశ్చిత్తం చేశాడు. ఈ పాపాత్ముడిని క్షమిస్తావు కదూ. ఏ నాటికయినా నీ హృదయంలో స్థానం దొరుకు తుందని ఆశించే

నీ మధు

కన్నీళ్ళతో వ్రాసి వుత్తరాన్ని పోస్టుచేశాడు మధు. మూడవనాడు జవాబు వచ్చింది. ఆత్రంగా కవరు చింపాడు.

ప్రియమైన బావకు

నీవు యీనాటికయినా నా బావవయినందుకు ఎంతో సంతోషించాను. నీ పరివర్తనే నా సంతోష భాష్పాలకు కారణం. నీ రాకకోసం ఎదురుచూసే

నీ 'అరుంధతి'

"అరూ! నీది యింత నిష్కల్మష హృదయమని మొదటనే గ్రహించలేకపోయాను" అని ఆనంద భాష్పాలు రాల్చాడు.

# దేవాలయ శిఖరాలు

శ్రీమతి పట్టిసపు భవానీగంగాధర్



ప్రశాంత నిశీధి. అతి ప్రశాంతమైన వెన్నెల. సందడి, జనకోలాహలము వినిపించని ప్రశాంతమైన పచ్చనిపైరులు. ఈ నిశ్శబ్దాన్ని ఛేదించుకొంటూ, తన కడుపులో వివిధరకాలైన శబ్దాల్నిచేసే మానవుల్ని రాచుకొంటూ గమ్యస్థానాన్ని చేరుకోవాలనే ఆతృతతో శరవేగంగా పరుగులేస్తున్నది రైలు. రైలు కంపార్టుమెంటులోని అద్దాలకిటికీ నానుకొని ఏమీ తోచక దిక్కులుచూస్తూ కూర్చున్నాను. దూరంగా ఆకాశానికి భూమికి సరిహద్దు. ఆ సరిహద్దు కీవలగా ఎన్నో రకాలైన చెట్లుచేమలు రైలును చూసి భయంభయంగా వెనక్కి అడుగులేస్తున్నాయి. దూరంగా అక్కడక్కడ మట్టితో కట్టిన గడ్డియిళ్ళు. వాటిల్లోంచి మినుకుమినుకుమనే దీపాల వెలుగులు కానవస్తున్నాయి.

హఠాత్తుగా నా దృష్టి నాకర్షించిన వింతైన దేవాలయ గోపురం. వెన్నెల్లో తళతళ మెరుస్తున్నట్లుగా గోచరించింది. దాని ప్రక్కనే మరొక గోపురం. రెండు గోపురాలు దగ్గరదగ్గరగా నిర్మించబడ్డాయి. దూరంగా చెట్ల కొమ్మల్లోంచి వింతగా మెరుస్తూ కనబడుతున్నాయి వాటి శిఖరాలు. ఈ నిర్మానుష్య ప్రదేశంలో ఈ ప్రశాంత ప్రకృతిలో అవి అలా ఎందుకు నిర్మించబడ్డాయి? వీటి వెనుక ఏదో వింత గాధ వుండేవుంటుంది. కాని ఎలాగ తెలుస్తుంది ఆ గాధ? ఆలోచనల్తో బుర్ర బరువెక్కింది. మెల్లిగా రైలు కుదుపుకి నిద్రలో మైమరచింది శరీరం.

◆ ◆ ◆

అవి ఔరంగజేబు సుల్తాను ఢిల్లీ నగరాన్ని పరిపాలిస్తూవున్న రోజులు. పరమత ద్వేషంలో మానవత్వాన్ని మరచిన మొగలులు హిందువులను పశువులకన్న అన్యాయంగా హింసించిన రోజులవి! ఎటు చూసినా గో బ్రాహ్మణ రక్తప్రవాహం అనర్గళంగా ప్రవహిస్తున్నది. కాఫరన్నవారు ఆ మహాప్రవాహంలో మునిగి, కొరాను పఠించి; కబాబులు తినవలసిందే! ''శంభో శంకర!'' ''హరహరమహాదేవ్!'' అని అరచినవానికల్లా అరచేతిలో వైకుంఠం చూపించేవారు అప్పటి మొగలులు. మానరక్షణకై ఎంతమంది హిందూ సుందరులు తమ సుకుమార దేహాల్ని అగ్ని కర్పించివేశారో! హిందూధర్మ రక్షణ కోరిన హిందూ యువకులెందరు మొగలుల కరకు కరవాలాలికి బలి అయిపోయారో! కుసుమకోమలులైన పసిబిడ్డలు, జరాభారులైన వృద్ధులు ఎంత నిర్దాక్షిణ్యంగా చిత్రవధ చేయబడ్డారో అవన్నీ ఊహించవలసినవే కాని, కలంతో చిత్రించలేని దారుణ దృశ్యాలు...!!!

ఈ కథ జరిగేనాటికి పరిస్థితులు ఇలాగ ఉన్నాయి. పరిస్థితులు ఇలాగ ఉండబట్టే ఈ కథ జరుగవలసిన అగత్యం ఏర్పడినది.

◆ ◆ ◆

కలకలలాడే కాపురమది. చూడ ముచ్చట గొలిపే ఆదర్శప్రాయమైన జంట అది. వారే మాధవీ ఆనందులు. ఉన్న కొద్దిభూమి కాయకష్టంచేసి దున్ని పండించి సంసారం యీదుకుంటూ, ఏ లోపం రాకుండా, కాపాడుకొంటున్నాడు ఆనందుడు. పెరట్లో వున్న పాడి, ఆవు, మొక్కలు, పూరిపాక వీటిని జాగ్రత్తగా కాపాడుకొంటూ, భర్త తెచ్చే సంపాదన జాగ్రత్తగా సర్దిపుచ్చి, సంసారం స్వర్గ తుల్యంగా నడుపుకొస్తుందా యిల్లాలు మాధవి.

తొలి కోడితోటే లేచి ప్రాచిచేసి, పాలుతీసి, ఆవును పూజించి, పెరుగు వెన్న చేసి, భర్తకు చద్ది వండిపెట్టి, పొలానికి పంపి, యింట్లో పనిపాటా చక్కబెట్టుకొనేది మాధవి.

నాగలి భుజాన వేసుకొని, ఎడ్లను తోలుకొని, పల్లెపదాలు పాడుకొంటూ, మాధవిని తలంచుకొంటూ హుషారుగా పొలానికి పోయేవాడు ఆనందుడు. కరకర లాడుతూ సహస్రకిరణుడు నడినెత్తికొచ్చే వేళకు నాగలి సడలించి, ఎడ్లకు మేత వేసి, చెట్టునీడకు చేరి, మాధవి కాలు అందెల ధ్వనికోసం యెదురుచూసేవాడు ఆనందుడు.

తన కంటికి అపురూపంగా దొరికిన కాయ, కసరు, ఆప్యాయంగా వండి గట్టిగా తోడుపెట్టిన తమ ఆవు పెరుగు, బువ్వ పట్టుకొని, కళ్ళల్లో ఎన్నో ప్రేమ భావాలు, అమాయకపు కబుర్లు నింపుకొని, భర్తకు "ఆలస్యమవుతుందేమో! ఆకలితో యెదురు చూస్తున్నాడేమో!" సని ఆత్రతగా అడుగులు వేసుకొంటూ వచ్చేది మాధవి.

ఇద్దరూ అమాయకంగా యేవో కబుర్లు చెప్పుకుంటూ తినేవారు. తరువాత ఆనందుడు పొలంపని చూసుకుంటూ వుంటే, మాధవి తమ పశువులకు కావలసిన గడ్డి సేకరించుకొనేది.

ప్రొద్దుతిరిగే వేళకు యిద్దరూ పశువులను తోలుకుంటూ ఏవో అర్థంకాని కబుర్లు చెప్పుకుంటూ యింటికి చేరుకొని తిరిగి గృహకృత్యాల్లో లీనమైపోయేవారు.

ఈ విధంగా ఏచీకూ, చింతా లేకుండా ఒకరికొకరు ప్రేమించుకొంటూ, ఒకరి కష్ట సుఖాలను మరియొకరు పంచుకొంటూ ఆదర్శవంతంగా కాలం గడుపుతున్నారా మాధవీ ఆనందులు.

◆ ◆ ◆

ఆరోజు మాధవి వొక్కర్తే వుంది. ఇంట్లోని గృహకృత్యాల్లో లీనమై వుందామె. ఆనందుడు ఆరోజున పొలంలో ఏదో పని వుండడాన్ని యింటికిరాలేదు.

ఇంతలో బయట ఏదో కోలాహలం వినిపించేసరికి, పనిపాటలు వదలి వెలుపలికి వచ్చిందామె. "అదిగో! వహ్వారే! ఎంత అందం! పట్టండిరా! దాన్ని!" అనే కేకలు, నినాదాలతో మొగలు సైన్యం మహాకోలాహలంగా బిలబిలలాడుతూ వచ్చేస్తున్నారు.

ఒక్కక్షణం మతిపోయిన దానిలాగ చూస్తూ వుండిపోయింది మాధవి. ఇంతలో అశ్వపద ధ్వానాలామె కర్ణపుటాల్ని ప్రవేశించాయి. ఒక్క లిప్తలో మారిపోయిందామె! నడుముకి పైట గట్టిగా బిగించింది.

జీరాడే కుచ్చెళ్ళు ఎగగట్టింది. మొహం రక్తవర్ణమైపోయింది! ఏదో వింత శక్తి ఆవరించింది! శక్తికొద్దీ పొలంవైపు పరుగు తీసింది. ముందామె!... వెనుక మొగలు సైన్యం....!

ఎడ్ల నదలిస్తూ భూమి దున్నుతున్నా డానందుడు. నుదుట చెమట బిందువులను తుడుచుకునేటందుకు శిరమెత్తి చూశాడు. అల్లంతదూరంలో ఎవరో...పరుగెత్తుకొంటూ తనవైపే వస్తున్నారు...! "ఎవరది?" రెండడుగులు ముందుకు వేశాడు! ప్రాణాలు "ఝల్లు"మన్నవి! "ఎవరు? తన జీవితసర్వస్వం మాధవి!" – కారణమేమో ఊహించలేకపోయాడు. మూఢునిలా చూస్తూ ఉండిపోయాడు.

దూరంలో కలకలం వినబడ్డది. తీక్షణంగా అటుకేసి దృష్టి సారించాడు. మొదట అర్థంకాలేదు. నిదాసించి చూశాడు. దేహంలోని యువకరక్తం పొంగింది.! మొగలు సైన్యం...! మాధవి యింకా దగ్గరయింది. అతనికంతా అవగాహన అయింది. ఒకడుగు వెనక్కి వేశాడు. త్వరత్వరగా ఎడ్లను నడలించి తోలేశాడు. నాగలి రెండు చేతుల్లోకి తీసుకొని నిలువబడ్డాడు. ఆహా! ఎంత గంభీరమూర్తి!!

మాధవి చేరువకి వచ్చింది. ఒక్కక్షణం వారి నేత్రాలు సంభాషించుకున్నాయి. అంతే! మాధవి పతి పాదములపై ప్రణమిల్లింది. ఆనందుడామెను తేరిపార వీక్షించాడు. రెండు నేత్రాలలోను నీళ్ళు నిలచినవి! ఒక్కసారి నేత్రములు మూసుకొన్నాడు.

అశ్వపద ఘట్టన మతివేగంగా సమీపిస్తున్నది! మాధవి తలయెత్తి ఆనందుని వంక అతిదీనంగా చూసింది. మాధవునికి తన కర్తవ్యం స్ఫురణకు వచ్చింది. వెంటనే విజృంభించాడు....చేతనున్న నాగలి పైకెత్తి...కన్నుల మూసుకొని..."హరహరమహాదేవ్" అని వుచ్చరించి... బలంగా...ఒక్క...వ్రేటు వేశాడు...!!! అంతే! మహాసౌందర్యమూర్తి-మాధవి... రక్తపుమడుగులో స్నానమాడింది!

ఆనందుడీ లోకమున లేడు...అతని ఆకారమే మారిపోయింది..చిదానందుడైన ఆనందుడు హాసప్రఫుల్ల వదనుడైన ఆనందు - అతిరౌద్ర భీభత్సమూర్తియైపోయినాడు. సమీపముననున్న ధాన్యరాశి రాశినంటించి మాధవి శరీరమును పూలమాలవలె పైకెత్తి అందులో వేశాడు!

ఇంతలో మొగలు సైన్యం సమీపించినది. జరిగిన దారుణకృత్యమును గాంచి వారు నిర్ఘాంతపోయి నిలచినారు. ఆనందుడతి తీవ్రముగా విజృంభించినాడు! చేతనున్న నాగలినే కరవాలముగా నుపయోగించి వారితో రణమొనర్చినాడు. ఆనాడు ఆనందుని ప్రతాపమున కడ్డులేదు. సైనికులమీద సైనికులు దీపముపై శలభములవలె, ఆనందునిపైకి దండెత్తి నిహతులై కూలిపోవుచునే యున్నారు. ఆనందుని యొడలంతయు గాయములతో నిండి, రక్తసిక్తమై క్రమక్రమముగా బలము క్షీణింపసాగినది. కొలదిసేపటిలో మహావీరు డానందుడు శక్తిహీనుడై శత్రు

మధ్యమున నాగటిని విడిచి మాధవి ప్రక్కనే యొరిగిపోయినాడు!

అనలుడు ప్రశాంతముగ ప్రజ్వరిల్లుచు నా దేవతామూర్తులను తనయందు లీనమొనర్చుకొన్నాడు. ఏదో తెలియని భక్తి భావము ఆ మొగలు సైనికుల హృదయాంతరాళముల నలముకున్నది. శిరము వంచి నమస్కరించి వారు వెడలి గ్రామస్థులతో జరిగిన కధనంతయు తెలియజేసినారు.

అనతికాలములోనే ఆ ప్రాంతములో దేవాలయము వెలసినది. ఆదర్శ దాంపత్యము కోరుకొనే యువజనాళి అచ్చట మ్రొక్కుబడులు చెల్లించుచుండును. రాత్రులందు మాధవీ ఆనందుల ఆత్మలచ్చట సంచరించుచుండుననియు, ఆనందుని యుల్లాసమునకై మాధవి యొనర్చు గానము దూరముననున్న పల్లెప్రజలకు యీనాటికి వినవచ్చుననియు అచ్చటి ప్రజలు చెప్పుకొనుచుందురు.

♦ ♦ ♦

ఏదో గానమువలె వినుపించి తెలివి వచ్చి చుట్టూ చూశాను. రైలు చక్రాల ధ్వని అవ్యక్తంగా యేదో గానరవళివలె వినుపిస్తోంది. స్టేషను దగ్గరపడి జనకోలాహలము స్పష్టంగా వినిపించుచున్నది. కాని యిది యంతయు స్వప్నమా!

# స్వీకారం

"రాఘవ"

(గత సంచిక తరువాయి)

"తల్లి సొమ్ముని వీళ్ళిద్దరూ, యెలాగైనా సరే కబళించి, కడకు తన్ను తిరిపెమెత్తుకొనేలాగు చేయటానికీ, వీళ్ళు తనతో యీ విధంగా లాలూచీ పడుతున్నారనీ, అందుకే యింత చనువిచ్చారనీ" ఎత్తుకుపై యెత్తుగా దీర్ఘాలోచనచేసి సావిత్రి హృదయాన్ని దిటవుపర్చుకొని యేదో విధంగా ఒక సాహస కృత్యంతో, తన తల్లికి పుట్టింటివారిచ్చిన నగల్ని కాపాడుకోవాలనిపించింది. 'ఏం చేయటం? ఎలా చేయటం?' అని ప్రొద్దువాటాలేవరకూ, పరిపరివిధాలుగా యోచించింది. తీరా దీపాలు పెట్టేవేళకు సావిత్రికి ఒక చక్కని ఆలోచన తట్టింది. దాన్నే పదేపదే నెమరువేసుకొంటూ వుత్సాహపూరితమైన వదనంతో, గబగబ మేడమెట్లు దిగి తన గదిలోకి వచ్చేసింది.

కాంతమ్మ వంటింట్లో అన్నం వారుస్తోంది. సీతాపతి యింకా వకీలు యింటినుంచి రాలేదు. సావిత్రి వచ్చీరావటంతోనే దీపం వెలిగించి, తండ్రి గదిలోకి వెళ్ళి పందిరిమంచం మీద పర్చబడిన పరుపుని అటూ-యిటూ కదిపి, యినప్పెట్టె తాళం చెవిని చేత్తో పుచ్చుకొని వచ్చి మండువా గది తలుపులు మెల్లిగా గడియవేసి, 'రత్తమ్మగారింటికి వెళ్ళొస్తా బామ్మా' అని దొడ్డివాకిలి గుండా వచ్చి కాంతమ్మకు చెప్పి, సావిత్రి వాకిలి గుండా యినప్పెట్టె వున్న గదిలోకి వచ్చి, తల్లిని తల్చుకుంటూ చెవి తిప్పింది. మొదటి తలుపు చప్పుడుకాకుండా తీసింది. ఎదురుగా ధనలక్ష్మి చిత్రం గోచరించింది. 'పుట్టింటి సొమ్ములు పెట్టుకుంటే మా అమ్మ అచ్చంగా యిలాగే వుండేది' అని తల్చుకొంటూ, తన ధైర్యాన్ని ద్విగుణీకృతపరుస్తూ, తల్లి సొమ్ముల్ని గబగబ తీసి, తల్లి కట్టిన ఒక పాత చీరను రెండు మడతల్ని వేసి, అందులో చడీ-చప్పుడూ కాకుండా మూటగట్టుకొని, మండువా తలుపుల్ని తెరుచుకొని తన గదిలోకి వచ్చేసి, పట్టిన చిరుచెమటని పమిటికొంగుతో తుడుచుకొంటూ - "అమ్మయ్య" అని ఒక్క నిట్టూర్పు తేలిగ్గా విడిచింది, తలపెట్టిన కార్యం ఒకటి పూర్తయినందుకు, దైవాన్ని - తల్లిని తల్చుకుంది. మిగతా పనిని కూడా యెప్పుడు చేద్దామా! అని గడియారం వంక తదేకంగా చూడసాగింది... ఆయాసం - రొప్పు - ఆదుర్దా కొంత తగ్గిన తరువాత, మూసిన మిగతా తలుపుల్ని బార్లగా తెరచి,... కాంతమ్మ దగ్గరకొచ్చి - తలనొప్పిగా వుంది బామ్మా. త్వరగా అన్నం పెడితే పోయి హాయిగా పడుకుంటాను. మళ్ళా నాన్న ఎప్పటికొస్తాడో ఏమో!" అంటూ ఆప్యాయంగా, పీట వాల్చుకొని, కంచం ముందెట్టుకొంది. కాంతమ్మ యిప్పుడు కాదనలేక కమ్మగా యేమి కావాలంటే, వాటన్నిటిని వడ్డించి, సావిత్రిని కడుపు నింపుకునేటట్లు చేసింది. అప్పటికి యింకా సీతాపతి రానూరాలేదు. సావిత్రి, 'యెవరెట్లా పోతే తనకెందుకు?' అనే భావంతో చరచరా వెళ్ళి తన గదిలో ప్రక్క వేసుకొని తాపీగా యేదో పుస్తకాన్ని చదువుతున్నట్లు నటిస్తూ, వుండిపోయింది. కాంతమ్మ వంటపని పూర్తిచేసుకొచ్చి గీతాపారాయణం చేసుకొంటూ దొడ్డివేపు గుమ్మంలో కూర్చుని వుంది.

ఎనిమిది గంటలు, తాలూకాఫీసులో కొట్టడమే తరువాయిగా, సీతాపతి సరాసరి వచ్చి, తల్లిని వడ్డించమన్నాడు. చేతిలో పుస్తకం కళ్ళకద్దుకొని, కాంతమ్మ లేచి, సీతాపతికి వేన్నీళ్ళుతోడి, స్నానం చెయ్యమన్నది. తానేమో వడ్డనకు పూనుకొంది.

అరగంటలో, తల్లితో ఆ మాటా యీ మాటా చెపుతూ హాయిగా భోంచేసి వచ్చి, పందిరిమంచం ఎక్కాడు సీతాపతి. పార్వతి పోయిననాటినుంచి పందిరిమంచం కొత్తదైనట్లు తోస్తున్నా వృథాగా వుండటం దేనికనే భావనతో పడుకోడానికి ప్రయత్నిస్తున్నాడు. ఆ మంచంలో ఏం మహాత్మ్యం వున్నదో గానీ, పడుకొన్న పది నిముషాల వరకూ

పార్వతిని గురించిన ఆలోచనలే ఉధృతంగా కలుగుతూంటాయి. ఒక్కొక్కసారి పార్వతి స్వరూపం కనిపించినట్లే కనిపించి అంతర్థానమై పోతూ వుంటుంది. అప్పుడు మాత్రం సీతాపతి యమబాధ పడి, చంటివాడిలా యేడుస్తాడు. పార్వతి, ఆ కాసేపు దివినుండి దిగివచ్చిన దేవత అనే భావంతో సీతాపతిని బ్రోస్తూ, చక్కా వెళ్ళిపోతుంది. ఆలా వెళ్ళిపోతున్న పార్వతిని వెంబడిస్తూ, "పార్వతీ! నువ్వెంత పుణ్యాత్మురాలివే! నా యీ బాధలన్నీ - అగచాట్లన్నీ యెలా అనుభవిస్తున్నానో అని చూసి ఓదార్చిపోవాలని వచ్చావా! నువ్వు చనిపోయి అదృష్టవంతురాలివైనా, యింకా నన్నీ లోకంలో కొంతమంది నిన్ను తల్చుకొంటూ నానామాటలు అంటూనే వున్నారు. నువ్వు నా భార్యగా బ్రతికి వున్నంతకాలం యే ఒక్కనాడూ సుఖపడేలాగు చేయలేకపోయాను. ప్రతి విషయంలోనూ - నీకు ద్రోహం చేస్తూనే వచ్చాను. నువ్వంటే, అమ్మ మాటలు విని పరమ అసహ్యపడ్డాను. ముచ్చటగా యే సంగతిని మురిసిపోయేలాగు చెప్పలేకపోయాను. నీ హృదయాన్ని చనిపోయేంతవరకూ అర్థంచేసుకోలేకపోయాను. పరంధామయ్యగారు నన్ను మోసం చేసి, నిన్ను నా భార్యగా అంటగట్టారని అపార్థం చేసుకొన్నాను. నువ్వు బ్రతికి చెడిన సంసారంలో పుట్టినదానివనీ, గౌరవమర్యాదలు లేనిదానివనీ, సాంప్రదాయమైన కుటుంబంలో సలక్షణంగా జన్మెత్తినదానివి కాదనీ, యిలాంటి నీచభావాల్నెన్నో, మా అమ్మ ద్వారా విని, నిన్ను నా భార్యగా తల్చక, సంకుచిత స్వభావంతో బ్రతుకుతూ వచ్చాను. యిప్పుడు నువ్వు లీలగా కన్పిస్తుంటే, నేనెంత పాపిష్ఠివాణ్ణయిందీ తెలుస్తోంది. నా మనస్సు నీ కోసం వెంపర్లాడుతోంది. నన్ను క్షమించమని కోరుతున్నాను పార్వతీ! ఒక్కసారి నా ముఖంవంక చూసి, తృప్తిగా నవ్వుతూ మాట్లాడవూ!" అని సీతాపతి శిథిల హృదయంతో మథనపడుతూ వుండేవాడు. అలాంటి నేడు మళ్ళా సంప్రాప్తించింది. తాలూకాఫీసులో పది గంటలు కొట్టారు.

కాంతమ్మ వాకిటి వసారాలో పడుకొని గుర్రు కొడుతోంది. సావిత్రి అంతవరకూ ఆలోచనలతో వేడెక్కి, చేతిలో అలంకరణార్థం వున్న పుస్తకాన్ని తల దిండుక్రింద జొనిపి, లేచి నిల్చుంది. పడకగదిలో సీతాపతి కమ్మగా పార్వతిని జ్ఞాపకం చేసుకొంటూ కలలే గంటున్నాడో, క్షమించమని ప్రార్థిస్తూ వున్నాడో, ఏమోగాని, మొత్తానికి ఆ గది నిశ్శబ్దంగా వుంది.

ఇదే మంచి తగిన సమయమని సావిత్రి ధైర్య సాహసోపేతంగా వున్నచోటునుంచి కదలి, మెల్లగా గడియ తీసుకొని, మండువా గుండా వంటింట్లోకి వెళ్ళి ముందు కాంతమ్మ ఒత్తులపెట్టె తెరచి, ఒక పది రూపాయల కాగితం తీసి రొంటిన దోపుకొంది. తరువాత, తల్లి పసుపు-కుంకుమ పెట్టుకునే భరిణెలు తీసుకొని, ఎడమ చేతిలోవున్న సంచీలో, నగల మూట - చీరెల మడతల మధ్య దాచిపెట్టింది. అటు పిమ్మట "యింకేం చేయాలి?" అని తనలో తాను ప్రశ్నించుకొంటూ మండువా మొగదల్లో గోడకు తగిలించివున్న పార్వతి ఫొటోను చప్పుడు కాకుండా తీసి సంచీ పైభాగాన పెట్టి లోపలికి అదిమింది. ఒక్కసారి యిల్లంతా కలయచూసింది. చిన్ననాటి సంగతులన్నీ స్మృతిపథంలో కదలాడినై. మమకార పూరితమైన భావాలు హృదయంలో తళుక్కుమని మెరిసినయి. అన్నిరకాలైన ఆలోచనల్ని అణగద్రొక్కుకుంటూ, బామ్మ పూజించే దేవుడి మందిరం దాపులకు చేరి మోకరిల్లుతూ — "ఇక నేను వెళ్ళిపోతున్నాను... బహుశా యీ రాత్రితో — నాకూ — యీ యింటికీ — ఋణం తీరిపోయినట్లే. ఆఖరిసారిగా, నిన్ను దర్శించుకొని, నీ పాదార్చనచేసి వెడదామనుకొంటున్నాను. నీ దయవల్ల యింతకాలమూ బ్రతుకుతూ వచ్చాను. కష్టమో - సుఖమో అనుభవించాను. వెళ్ళిపోతున్నాను. వెళ్ళిపో...తు...న్నాను...స్వామీ!" అని లోలోన అనుకొని, చడీ చప్పుడు గాకుండా వంటయింటి తలుపులు రివ్వగా తెరుచుకొని చీకటి తెరలగుండా...నిశ్శబ్దంగా వూరుకొన్న వూరు మధ్యలోంచి — కోనాయి చెరువుగట్టు మీదగా చరచరా నడుస్తూ — రైల్వే స్టేషన్ వైపు పురోగమించింది. అక్కడి దీపాలు ఆ నిశాంత ప్రశాంత వాతావరణంలో మినుకుమినుకు మంటూ వున్నయి దూరానికి. అప్పటికి సీతాపతి యింట్లో గోడగడియారం, పదకొండు గంటలు కొట్టి విసుగెత్తింది.

సీతాపతి మంచి నిద్రలో వుంటంవల్ల-కాంతమ్మ లేపి, పాడిగేదెకు పచ్చగడ్డి వేయమని చెప్పలేకపోయింది. తను వేద్దామా! అంటే లేచే వోపిక లేదు. కాసేపాగి తరువాత లేపుదాములే అని మెలుకువ వచ్చినా, మళ్లా కళ్ళు మూసుకొని బలవంతాన ముడుచుకొని పరుండటం జరిగింది.

బయలుదేరిన వేళావిశేషంవల్ల సావిత్రి యే ఆటంకమూ లేకుండా సరాసరి స్టేషన్‌కి వెళ్ళి, గబగబా నడిచి రావటంవల్ల యేర్పడిన ఆయాసం — రొప్పు — ఆదుర్దాని నిట్టూర్పుల ద్వారా వుపశమింప చేసుకోసాగింది. పట్టిన చెమటని పమిటిచెంగుద్వారా తుడుచుకొంటూ, ఒక బెంచీమీద కూర్చుంది. పది నిముషాలనంతరం తిరిగి లేచి స్టేషన్ వెనుకవైపు వున్న ఒక నీటిముడుగు దగ్గరికిపోయి, కాలితో రేవును వెతుక్కొని ముఖప్రక్షాళన — పాదప్రక్షాళన గావించుకొని ఒడ్డుకొచ్చి — "అమ్మయ్యా" అని చతికిల పడుతూ సిగ్నల్ వంక చూసింది. ఎర్రదీపమే కనిపిస్తోంది. ఫర్వాలేదనుకొంది మనస్సుని స్థిమితపర్చుకొంటూ.

తను బయలుదేరేముందు అనుకున్న విధంగా, సావిత్రి, తల్లి చీరల్లో ఒకదాన్ని తీసి చక్కగా కట్టుకొని, హడావిడిగా నడిచిరావడంలో చెదరిన తలకట్టుని, కొమ్ముదువ్వెనతో చక్కదిద్దుకొని, వాలు జడ వేసుకొంది. పాదాలకు పసుపు రాసుకొంది. నుదుట కుంకుమ పెట్టుకొంది. వెనుకటి జీవితం అంతా ఒక్కసారిగా తలపుకొచ్చింది. తల్లి నగలమూట విప్పి, రెండు బంగారు జతల గాజుల్ని ముంజేతికి తొడుక్కొని తన్నుదాను ఆలవోకగా చూసుకొని తృప్తి పడింది. వైధవ్య ప్రాప్తివల్ల ఏర్పడిన వల్లకాటి ప్రేమ అంతలోనే విముఖత్వం చెందింది. "మునుపటి సావిత్రిని నేనేనా!" అని ఒళ్లు తడిమి చూసుకొని మురిసిపోయింది. యీ వేషంలో నన్ను గనుక మా అమ్మ చూస్తే యెంత బాగుండును" అని తలపోసింది.

ఇంతలో పోర్టరు మొదటి గంట కొట్టాడు. సావిత్రి ఆ సింగారంతోనే, గబగబా సంచి సర్దుకొని వచ్చి, టిక్కెట్లిచ్చేచోట నిలబడింది. యింకా మరి కొంతమంది ప్రయాణీకులు కూడా ప్రక్కగా వచ్చి నిలబడ్డారు. వాళ్ళకి తన ముఖాన్ని కనబడనీయకుండా చేసుకొని, కిటికీ తలుపులు తెరచీ తెరవడంతోనే —

"ఒక ఫస్టుక్లాసు టికెట్ యివ్వండి — బెజవాడకు" అంది. స్టేషన్ మాస్టరు ఒక్కింత వులిక్కిపడి — "యీ బండికి సహజంగా ఫస్టుక్లాసు ప్రయాణీకు లెవ్వరూ రారుగదా! ఎవరీమె?" అని కిటికీగుండా సావిత్రిని చూశాడు ఆశ్చర్యంగా. యీ లోపుగా సావిత్రి తన చేతిలోని పది రూపాయల కాగితాన్ని కిటికీ గుండా లోపలికి అందించింది. ముంజేతులకు వున్న బంగారు గాజులను చూడగానే స్టేషన్ మాస్టరు - మనకెందుకులెద్దూ ఎవరైతేనేం" అని ఒక మొదటి తరగతి టికెట్ తీసి, తేదీ నొక్కిచ్చాడు. సావిత్రి దాన్ని జాగ్రత్తగా పట్టుకొని ప్లాట్‌ఫారం మీదకు వచ్చి ఒకచోట కూర్చుంది.

ఇంతలో రెండో గంట కొట్టేశారింది. దూరాన సిగ్నల్ దీపం పచ్చగా కనిపిస్తోంది. ఆ పైన రైలు వస్తున్నట్లుగా జాడ కనబడుతోంది. క్రమేపీ బండి దగ్గర కొస్తుండగా, పోర్టరు రెండో గంట కొట్టాడు. బండీ వచ్చి ప్లాట్‌ఫారం మీద ఆగింది. సావిత్రి వెంటనే ఎక్కి సుఖగా కూర్చుంది. చేతిలో సంచిని భద్రంగా పట్టుకొంది.

రైలు మళ్లీ యథాప్రకారం కదిలింది. 'యింత వరకూ అనుకున్నదంతా బాగానే జరిగింది. యిక ముందు ఎలా వుంటుందో' అని ప్రయాణం సాగిస్తున్నకొద్దీ ఆలోచనలు ముసురుకోసాగినయి. రైలు శరవేగంతో రెండు స్టేషన్లలో ఆగి - ఆగి - బెజవాడకు చేరింది.

సావిత్రి దిగీదిగటంతోనే, టికేట్ యిచ్చేసి, బయటికొచ్చి రిక్షా చేసుకొని మురారి యింటిముందు దిగింది. అప్పటికి పన్నెండున్నర దాటింది.

ఇక్కడ పీడకల గంటున్న సీతాపతి అమాంతంగా లేచి, "దొంగలు - దొంగలు... అమ్మా!... అమ్మా!!" అని గావుకేకలు పెట్టాడు. కాంతమ్మ అవులిక్కిపడి లే - "ఏమిటిరా! దొంగలేమిటీ" చింటూ దీపాన్ని ఎక్కించింది. సీతాపతి కళ్ళు నులుముకొంటూ, "అమ్మా! మనింట్లో దొంగలు పడ్డట్టూ — పార్వతి సొమ్మంతా ఎత్తుకుపోతున్నట్లు— సావిత్రిని కూడా తీసుకొనిపోతున్నట్లూ! యేమిటోనే వెధవ పీడకల వచ్చింది" అన్నాడు గాబరాతో.

"నీ మొహం ఏమీలేదుగాని పడుకో! అదే యావతో వుంటే అలాంటి కలలేరాక, మరింకోటి ఎందుకొస్తయి. యింతమంది యింట్లో వుండగా యెవ్వడూ గాని దొంగలు యివాళెందుకొస్తారు?" అంటూ సీతాపతిని కుదుటపర్చి, తలుపులు జాగ్రత్తగా వేసుకొని, కాస్త మెలకువతో పడుకోమని చెప్పింది.

(సశేషము)

# అన్నదాత అజ్జాడ అన్నయ్య

శ్రీ నిడదవోలు పెదసూర్యనారాయణ



మన దేశంలో దాతలు, పుణ్యపురుషులు అనేకమంది జన్మించారు. అట్టివారిలో అజ్జాడ అన్నయ్యగారొకరు. కల్ల, కపట మెరుగని సాధుపుంగవుడు. నిత్య కర్మానుష్టానములు ఆయనకు అలంకారము. ప్రతి దినము బ్రహ్మముహూర్తమున హిరణ్యగర్భునకు అర్ఘ్యపాద్యములిచ్చి, భగవంతుని పూజించికాని మరుపని చేయువాడుకాడు. అందుకనే కాబోలు ఆ ప్రాంతంలో ఆబాలగోపాలం అన్నయ్యగారిని పూజ్యభావంతో చూచేవారు.

అన్నయ్య స్వార్థమెరుగని నిష్కామయోగి. నిరంతరము జగత్కళ్యాణాన్ని గురించే భగవంతుని ఆరాధించి ప్రార్థించుచుండువాడు. ఆయన పరోపకార చింత, మానవసేవపట్ల అసక్తి అనన్యములు.

ఒకరోజున అలవాటు ప్రకారము సహజధోరణిలో దైవకార్య తత్పరుడై యుండ "నేను వస్తానురా!" అన్నమాట అన్నయ్య చెవునబడింది. ఆయన చుట్టూ కలయచూచి అక్కడ ఎవరు లేకపోయే సరికి ఎవరో! ఏమిటోలే! అనుకున్నాడు. తరువాత వరుసగా ప్రతిదినము అదే సమయానికి అదేమాటను తన చెవులో వూదినట్లుండేసరికి కడపటిరోజున అన్నయ్య ధైర్యం చిక్కబట్టుకొని "ఎవరు నీవు?" అని అడిగాడు.

"నేనురా! – భాగ్యదేవతను. ఇచ్చటికి వచ్చియున్నాను. లోకం మెచ్చేటట్లు నన్ను స్వీకరించి వెచ్చించి సచ్చరితుడవు కమ్ము!" అంటూ భాగ్యలక్ష్మి అన్నయ్యగారి గదిలో గలగల శబ్దంతో పైకివచ్చి నిలిచింది.

అన్నయ్య చంచలమైన లక్ష్మి యని గ్రహించి, "నీవా తల్లీ! నేనింతకాలం చీకు, చింత లేకుండా పరమాత్మను సేవిస్తూ కాలం గడుపుతున్నాను. నీవు నా యింటికి రావడమంటే - నీవు చంచల చిత్తవు; నీవల్ల నాకనేక యాతనలు ఏర్పడతవి తల్లీ! నన్ను క్షమించి నన్ను వీక్షింపకుము" అన్నాడు ముకుళిత హస్తాలతో.

"చూడు అన్నయ్యా! నీకటువంటి యాతనలేమి యుండవు. ఈ సంపదనంతా నిత్య అన్నదానానికి వినియోగించి ధన్యుడవు కమ్ము!"

"మంచిది తల్లీ! నీవు స్థిరచిత్తము కల దానివి కావు. కాబట్టి నీవిక్కడనుండి ఎప్పుడు తప్పుకుందువో కూడ చెప్పు."

"అలాగే – నీ యింట నీ చెవులకు రోదన శబ్దం ఎప్పుడు వినబడుతుందో అప్పుడు నేను తొలగిపోతున్నట్లు గ్రహించు" అని మాయమైపోయింది లక్ష్మి.

అప్పటినుండి అన్నయ్యగారిల్లు ధనధాన్య సంపదలతో రాజిల్లింది. ఆయన యిల్లొక సంస్థానమై నిత్య అన్నదానం తోటి, నిరంతర భగవత్కార్యాలతోటి

కళకళలాడుచుండేది. ఏ వేళకు ఎవరు వచ్చినా అన్నదానం చేయుచుండిన అన్నయ్యకు 'అన్నదాత' బిరుదు సార్థకమైంది. ఆయన యశస్సు ఆచంద్రార్కంగా ఒప్పింది.

ఒకప్పుడు వర్షఋతువు ప్రారంభమయింది. రాత్రివేళ ఒక దీనాతిదీనుడు, "ఆకలి బాబూ! చలి బాబయ్యా! రక్షించాలి!" అని మొరబెట్టసాగాడు నది కావలి ఒడ్డున. నిద్రపోతున్న అన్నయ్యను ఆ యార్తానాదం తట్టి లేపినట్లయినది. వెంటనే అప్పటికప్పుడు వంటచేయించి, చేత స్వయంగా తీసికొని, దాంతో బాటు ఒక దుప్పటి, కాల్చుటకు చుట్టసయితము చేబట్టి నది దగ్గరకు పోయేసరికి అది పొంగి పొరలుతూ యుండింది. కండ్లు మూసుకొని చేతులు జోడించి ఒడ్డున నిలబడి 'అమ్మా! గంగాభవానీ! నా కార్యము అనివార్యమైనదని నీవు తలిస్తే దారి యియ్యమ్మా! ఆనాడు వసుదేవునకు కృష్ణుని వ్రేపల్లెకు చేరవేయడానికి అనుగ్రహించావు. ఇక నీ దయ తల్లీ" అని ధ్యానించి కళ్లు తెరిచే సరికి నదిలోని నీరు రెండు భాగములై అన్నయ్యకు దారి ఏర్పడిందట. ఆయన నది దాటివెళ్ళి ఆ దీనునకు స్వయంగా తీసికొనివెళ్ళిన దుప్పటి కప్పి, అన్నం కలిపి చేత ముద్దలు పెట్టి తినిపించాడట. ఆ దీనుడు "స్వాములూ! మీరా! నేను అంటరానివాడిని కదా - మీరు." అంటుంటే అన్నయ్య చిరునగవుతో "ఆ భేదానికి తావులేదు నాబోటివానికి. ఆపదలోనుండి నా సహాయం కోరినవారికి సేవ చేయడమే నా ధర్మం" అంటూ ఆ పరమనిష్టపరుడు చుట్ట అతని కందించి కాల్చుకోవన్నాడట.

అప్పటినుండి ఆ దీనునిలోని పరివర్తనము అన్నయ్య ఆశ్రయానికి పాత్రమైంది.

ఒకప్పుడు కల్లుగీత వాడొకడు తాటిచెట్టెక్కి ముచ్చె చేరేసరికి పాముకరిచి క్రిందపడ్డాడు. ఆ దారిన పోవుచున్న అన్నయ్య అతనిని చూచి దగ్గరకుపోయి అతని మణికట్టు స్పృశించేసరికి కల్లు గీతవానికి తెలివివచ్చి లేచి కూర్చున్నాడని చెప్పుకుంటుంటారు.

స్వార్థరహితమైన ఆయన సేవాతత్పరత మంత్రసిద్ధి పటిమకన్న మిన్నగా యుండిందట. ఆయన స్పర్శ, వీక్షణము అనేక మందిని భూత, ప్రేత, పిశాచముల బారి నుండి రక్షించినవట. ఇంకా అన్నయ్య గారి ఉదారహృదయాన్ని గురించి, లోక కళ్యాణము నుద్దేశించి చేసిన మహత్కార్యాలను గురించి అనేకం చెప్పుకుంటుంటారు. ఆయన నిత్యాన్నదానం శాశ్వతమైన కీర్తిప్రతిష్టల నార్జించి పెట్టినది. మంత్రాలు, తంత్రాలు, ధనరాసులు సాధించలేని ఘనకార్యాలను దివ్యపురు

> ప్రజలచే ప్రజలకోసం, ఏర్పాటు చేసుకొనబడిన ప్రజాప్రభుత్వానికి ప్రపంచంలో ఎన్నటికీ నాశనంలేదు. —"అబ్రహాంలింకన్"
>
> ♦ ♦ ♦
>
> మానవ శ్రేయస్సే ప్రతి జాతికీ, సర్వ జాతులకూ ప్రధానలక్ష్యం అనీ, మానవ కుటుంబంలో తానొక భాగమనీ ఏ జాతీ విస్మరించదు. —"మాన్యుయల్ కివిజాన్"
>
> సేకరణ: వేముల కోటుంబరావు

షుడుగా అనేకులకు సాధించిపెట్టాడు పారమార్థిక చింతతో.

కొంతకాలానికి ఒకరోజున నిత్యకృత్యములు నిర్వహించుచుండగా యింట్లో ఒకమూలనుండి 'నేతిడబ్బా లేదు' అన్నమాట వినిపించింది. దానివెంబడే యింట్లోని సమస్త వస్తువులు భూమిలోనికి దిగిపోవుచున్నట్లు కనుపించింది. కనీసం దేవతార్చన పళ్లెం అయినా దక్కుతుందేమోనని దానిని గట్టిగా పట్టుకునేసరికి సగం మాత్రం అతని చేతిలో మిగిలింది. ఇల్లంతా స్మశానవాటిక లాగయింది. ప్రతినిత్యము వందలు, వేలమంది యుండే చోట ఒక్కరైనా మిగులలేదు. అన్నయ్య అందుకు విచారపడకుండా కాశీకి బయలుదేరాడట.

దశదిశల పేరుమ్రోగిన అన్నదాత అన్నయ్య కాలినడకన సగం దేవతార్చన పళ్ళెంతో ప్రయాణం సాగిస్తుంటే యావత్ప్రజానీకం ఆదరించి, అభిమానించి ప్రణమిల్లింది. శ్రీకాకుళం రాగానే అచ్చటి సంపన్నులు ఎంబాడవారు అన్నయ్యను ఆహ్వానించి స్వాగతమిచ్చారు. వారింట్లో భోజనానికి ముందు పూజామందిరం వద్ద ఎదురుతిన్నెపై మిగిలిన పళ్లెము చెక్కను చూచి "అమ్మ యిక్కడికి వచ్చింది కాబోలు!" ననుకుంటూ తనదగ్గర నున్న దానితోబాటు ఆ పళ్ళెపు చెక్కను జరాసంధుని అవయవములవలె కలిపేసి స్థిరచిత్తుడయ్యాడట.

ఆ విచిత్ర సంఘటనను వివరిస్తూ అన్నయ్య "నా యిల్లు వీడిన లక్ష్మి యిక్కడికి నడిచివచ్చి వెలసింది. నా కడనున్న శేషముకూడ నిశ్శేషమైనది. ఇక నాకు కావలసింది భగవచ్చింత మాత్రమే-నేను వారణాసి కేగుచున్నాడ" అని వెళ్ళిపోయారట.

అప్పటినుండి యిప్పటివరకు అన్నయ్యతోబాటు శ్రీకాకుళం జిల్లాలోని అజ్జాడ ఎన్నికలోకి వచ్చింది.

# సందేశం

శ్రీ పన్నాల సుబ్రహ్మణ్య భట్టు

మెడికల్ కాలేజి తెరచిన మొదటి రోజులవి. శాంత డిసెక్షన్ చేయలేక దిగాలుగా కూర్చుంది. విసుగ్గా కత్తెరని బల్లమీద పడేసింది. ఎవరో వెనకాలనుంచి నవ్వారు. శాంత వెనక్కి తిరిగి చూసింది.

శేఖర్ నవ్వుతూనే అన్నాడు. 'మీరు జూనియరా?'

శాంత బుర్ర వూపింది అవునన్నట్లు.

శేఖర్ ఫైనల్ ఇయర్ చదువుతున్నాడు.

"ఇది డిసెక్షనా, బట్టలు కత్తిరించడమా? ఏకంగా నరాలు, ఎముకలు అన్నీ కట్ చేసేశారే" నవ్వుతూనే అన్నాడు.

"మీరూ జూనియరే కదా ఒకప్పుడు" - శాంత కోపంగా అంది. "మీరు సీనియరులా వున్నారు. అయినంతమాత్రాన జూనియర్స్‌ని హేళన చేయనక్కర్లేదు. మీకు చేతనవుతే సహాయం చెయ్యొచ్చు."

శేఖరు పరీక్షిస్తున్నదానిని అలా వదిలేసి "సారీ ఏదో సరదాగా అన్నాను. మీరంత సీరియస్‌గా తీసుకుంటారనుకోలేదు. కోపగించుకొంటే ఇక్కడ మనమేం నేర్చుకోలేం" - శాంత ఏం మాట్లాడలేదు.

శేఖరే అన్నాడు "గ్రహించారనుకొంటాను."

"ఆఁ..."

"రేపు వస్తే డిసెక్షన్ చేసి చూపిస్తాను".

"థాంక్స్!"

"నా పేరు తెల్సుకొంటారా!"

"చెప్పండి."

శేఖర్ విజిటింగ్ కార్డు ఇస్తూ - 'శేఖర్' అన్నాడు.

'మీ పేరు?'

'శాంత'.

♦ ♦ ♦

మొదట్లో శాంతకి ప్రాక్టికల్స్‌కి భయంగా వుండేది. కాని శేఖర్ సహాయంతో 'థీరీ'లో కూడ మంచి మార్కులు వచ్చేవి. వారి గాఢమైన మైత్రి ప్రేమగా పరిణమించింది.

పార్కులో రేడియో తనని గుర్తించమని గోలపెట్టింది. ఇదేమి తమకి పట్టనట్టు సీతాకోకచిలుకలు ఒక చెట్టుమీదనుంచి మరోచెట్టుమీద కెగురుతున్నాయి' గులాబీ పువ్వుమీద భ్రమరం వ్రాలింది. గులాబి ఓటమి అంగీకరించింది. భయంతో భ్రమరం కొద్దిగా పైకెగిరింది. అంతట్లో మళ్ళీ అదే పువ్వుమీద వచ్చి వ్రాలింది. పాప కాళ్లో పల్లేరుకాయ గ్రుచ్చుకొంది. పల్లేరుకాయని తీసేసి మళ్ళీ తన ఆటలో లీనమైపోయింది.

శాంత గడ్డిపువ్వుని చిదుపుతూ అంది. "మీ కథ చదివాను. చాలా బావుంది. వాస్తవికతను చిత్రీకరించడమే మీ ధ్యేయమనుకొంటా."

శేఖరేం బదులు చెప్పలేదు.

"కేవలం సమాజంలోని మంచి, చెడులను యథాతథంగా చిత్రీకరించడంతోటే మీ బాధ్యత తీరిపోదు."

శేఖర్ కొంచెం ఆశ్చర్యపోయాడు. ఇన్నాళ్ళు తన రచనల్ని చదివి ప్రోత్సాహపరిచేదే కాని సమీక్షించేది కాదు.

శేఖరు కావాలనే మాట్లాడలేదు.

అయినా శాంతే మాట్లాడింది — "సమాజాన్ని నగ్నరూపంలో ప్రస్తుతపరచి విశదీకరించడంలోటే మీ ధ్యేయం అంతంకాకూడదు. ప్రేమ, జుగుప్స మొదలైన మానవ సహజగుణాలికి సరియైన నిర్వచనం-సంబోధనమయ్యేటట్టు చూడ్డంలోనే మీరు పరిమితి చెందకూడదు. ప్రతి సమస్యని విడమర్చి, సాధించడానికి అనువైన స్థితి ఏర్పరచాలికాని వాటిని మనమే సాధించకూడదు. ప్రజలకు స్వశక్తిమీద ఆధారపడే పరిస్థితి కల్పించడమే ఒక సాహిత్యారాధకుని విధి."

శేఖరుకు చెప్పలేని సంతోషమయింది. తన కర్తవ్యానికి మార్గం ఎటో శాంత చెప్తున్నట్లనిపించింది. కొంచెం సంభాషణని పొడుగిద్దామనుకొన్నాడు.

ఇంతలోనే శాంత అంది — "ఇలా సమీక్షిస్తున్నందుకు ఆశ్చర్యపోతున్నారనుకొంటా. ఏదో చెప్పాలనుకొన్నా — చెప్పానంతే."

శేఖరు ఇదేమీ గమనించలేదు — ఇందాకటి

దానికి సమాధానం చెపుదామనుకొన్నాడు! చెప్పాడు!! ప్రజలలోని భావాలన్నిటిలో కొన్నిటిని, వారు వ్యక్తపరచిన అభిప్రాయాల్ని ఆధారంగా చేసుకొని వాటి వికృత, ఆనందకర పరిణామాల్ని మనం చర్చించగలము కాని ఆదర్శమునకు ఎక్కువ ప్రాధాన్యత ఇచ్చి వాస్తవికానికి భంగం కల్గించలేం.”

“...కాని ప్రేమ, ఈర్ష్య, కరుణ మొదలైన మానవ సహజగుణాలు నశించడం, అభివృద్ధి చెందడం మీదనే కదా మానవుల అభ్యుదయం ఆధారపడి వుంది. మనం ఇప్పుడు పైపదాలకి ఇస్తున్న నీచ విలువలని సరిదిద్దేందుకు అనువైన వాతావరణ మివ్వడం మీ ఉచిత కర్తవ్యం.”

పార్కులో నెమ్మదిగా అందరూ వెళ్ళిపోతున్నారు.

శేఖరు శాంత అన్నమాటల్ని గురించే ఆలోచిస్తున్నాడు. శాంత మామూలుగనే అంది. సారీ! శేఖర్! ఏదో ఉబుసుపోక ఉపన్యాస మిచ్చినట్లు మాట్లాడాను.”

శేఖరు గడ్డిమీద ఓరగా పడుకొన్నాడు. శాంత కాళ్ళు ముడుచుకొని కూర్చుంది. కాలిమడమ గడ్డిలోకి గుచ్చుతూ -

‘లెండి! ఆలస్యమయింది పోదాం!’ - ఆఖరికి శాంతే అంది. శేఖరు లేచి నడవడానికి ప్రయత్నం చేసాడు. పడబోయి ఆపుకొన్నాడు.

శాంత ఆతృతగా ప్రశ్నించింది_‘ఏదేమండి?’

“కొంచెం కాలు తిమ్మిరెక్కిందంతే” అంటూనే శేఖరు నడవడానికి ప్రయత్నించాడు.

శాంత పడిపోకుండా అతని చెయి పట్టుకొని నడిపిస్తోంది. ఆమె స్పర్శ ఇదివరకతనికి తెల్సినా ఇప్పుడామె బుద్ధిని, వ్యక్తిత్వాన్ని అందిస్తోంది. అందుకే అతనికి స్వర్గతుల్యంగా వుంది. శాంత మాత్రం ఇందాకటిలాగే ఇప్పుడు గంభీరంగా వుంది. ఆమె ఆదర్శం, ధ్యేయం వేరు. ఆమె అతనిని ప్రేమిస్తోంది - అతని తెలివితేటల్ని చూసి, బుద్ధికుశలతల్ని చూసి, ఉపకారగుణం చూసి, ఆమె దృష్టిలోని ‘సేవ’కి అర్థం వేరు. ఆమె అతనికి సేవ చేయడం కోసం ప్రేయసిగా, భార్యగా వుండాలని కోరుకుంటోంది. తనకు తాను ఆమె అల్పజీవి.

♦ ♦ ♦

‘హల్లో, శాంతా! కమ్ ఇన్! ఏంటి ఇంత మధ్యాహ్నం వచ్చావ్’ - ఆహ్వానించాడు శేఖర్. స్టేషన్ కెళ్తున్నా! మా సిస్టర్, విమల మద్రాసు నుంచి వస్తున్నానని ‘వైర్’ ఇచ్చింది. రిసీవ్ చేసుకోవాలి. మీరు వస్తారేమోనని వచ్చా.

‘ఓ! అలాగే! ఇప్పుడే వస్తా!’ లోపలికెళ్ళాడు శేఖర్.

♦ ♦ ♦

టాక్సీ రైలు స్టేషన్ దగ్గర ఆగింది. అప్పటికే మద్రాసు నుంచి వచ్చే రైలు ఆగివుంది.

> ## అత్తగార్ల పోటీ
>
> ఇటలీ దేశంలో నొక గ్రామంలో అత్తగార్లకు ప్రథమ, ద్వితీయ బహుమానాలు నిర్ణయించి యిస్తారు. అంటే కోడండ్రుగాని, అల్లుళ్లుగాని తమ అత్తగార్ల పేర్లను సూచిస్తూ వారి మంచితనాన్ని యోగ్యతలను తెలియజేయాలి. అల్లుళ్లు, కోడండ్రు తమ అత్తలతో కలసి కాపురముంటున్నవారై యుండాలి. అల్లుళ్లు, కోడండ్రు సూచించిన తమ అత్తగార్ల పేర్లను, వారి యోగ్యతలను నియమిత సంఘం పరిశీలించి ఇద్దరిని ఎన్నుకొని ప్రథమ, ద్వితీయ బహుమానములుగా బంగారు, వెండి రోలింగ్ పిన్నులను యిస్తారట.
>
> ఇటువంటి ఎన్నిక, బహుమానాలు మంచి అత్తగార్లను రూపొందించుటయేకాక అత్త కోడండ్ర మధ్య, అత్త అల్లుళ్ల మధ్య సామరస్యం, సద్భావం పెంపొందుతుంది.

“ఇంత లేట్ చేశావేం అక్కా! ఇప్పుడే మీ హాస్టల్‌కి ఫోన్ చేశాను. నువ్వు లేవు అన్నారు” అంది విమల.

“సారీ! నామూలానే అయింది ఆలస్యం.”

“ఈయన శేఖర్ చెల్లాయి ఇక్కడ మెడిసిన్ ఫైనల్ చదువుతున్నారు...మా సిస్టర్ మొన్నే

ఇంటర్ పాస్ అయింది.” ఇద్దరినీ పరిచయం చేసింది శాంత.

‘నమస్కారమండీ’

‘నమస్తే’ ప్రత్యభివాదన చేసింది విమల.

“రూమ్‌కి పోదామా విమలా?” అంది శాంత.



సాయంకాలమయింది. విమల సినీమాకి వెళ్దాం అంది. ముగ్గురూ బయల్దేరారు. విమల చలాకీగా దారి పొడుగునా కబుర్లు చెబ్తూనే వుంది. శేఖర్ ఆమె చలాకీతనాన్ని అభినందించకుండ వుండలేకపోయాడు. శేఖర్ సినీమాలో ఇద్దరి మధ్య కూర్చున్నాడు. పాశ్చాత్య సినీమాలోని వాస్తవికత గురించి విమల మధ్యమధ్య ధారాళంగా మాట్లాడ్తోంది. శేఖర్ విమల చనువుకి ప్రప్రథమంగా ఆశ్చర్యపోయాడు. శేఖర్ ఆకర్షింపబడడం శాంత గ్రహించకపోలేదు. ఆమె శేఖర్ ప్రేమని, తన ఆశయానికి అవకాశం కల్పించమని - అర్థిస్తోంది. ఆమె కోరికలో శారీరకంగాను భౌతికంగాను వాంఛ నిర్లిప్తమవలేదు.



విమల శేఖర్‌తో చూడని ప్రదేశమేమీ లేదు. పార్కులు, ప్రదర్శనశాలలు అన్నీ. విమల శేఖర్‌ని నిష్కల్మషంగా, సహజంగా ప్రేమించింది. కాని శేఖర్ మానసికంగా నిర్బలుడు. విమలకి మనసివ్వడంలో శాంత నిదివరకు ప్రేమించినట్లు మరచాడు. అతనికి ఆదర్శాలు, ఉన్నతాశయాలు వున్నాయి. కథాకారుడుగా అంతరంగికంగా ఆ ఆశయాల ప్రభావం అతనిమీద పడలేదు.

విమల, శేఖర్ వచ్చేటప్పటికి శాంత ఏదో పుస్తకం చదువుతోంది. వాళ్ళు రావడం చూసి టేబిల్‌మీద పుస్తకం పడేసి అంది - “ఎక్కడికెళ్ళారు ఇవాళ?”

‘ఈడేన్ గార్డెన్స్ కేసి’ శేఖర్ జవాబిచ్చాడు.

“విమలా! ఫస్టు ఇయర్ కదా అని అశ్రద్ధ చేయకు.”

“ఆ! పరవాలేదు.”

మీకు రేపటితో శలవలయిపోతాయేమో.”

“అవును! రేపు 29th యే లాస్టు డేటు.”

“మరెప్పుడు ప్రయాణం?”

“వెళ్ళిపోతావా! విమలా!” ఆశ్చర్యంగా, బాధగా, సీదాగా అన్నాడు శేఖర్.

“నే వెళ్ళనక్కా.”

మరి స్టడీసు.

“ఇక్కడే చదువుకొంటా.”

“అక్కడ కొంత! ఇక్కడ కొంత ఏమిటి!”

“నాకిక్కడే చదవాలని వుంది.”

తనకేమీ పట్టనట్లు నవ్వింది శాంత. మళ్ళీ పుస్తకం తెరచి చదవడంలో లీనమైపోయింది.

“నేనివాళ హార్బరు చూడటానికి వెళ్ళాలి నువ్వు రా అక్కా” – విమల అంది కొంతసేపున్నాక.

“నేను హాస్పిటల్‌కి వెళ్ళాలి విమలా.”

“మీరో శేఖర్!”

“శేఖర్‌కి పరీక్షలేమో, నీవు వెళ్ళకూడదు.”

“పర్వాలేదు. నే వస్తా. రాత్రి ఇంకో గంట ఎక్కువ చదువుతాను” అంటూ శేఖర్ విమలతో బయల్దేరాడు.

శాంత నిశ్శబ్దంగా ఊరుకొంది. శేఖర్ తనచేయి దాటిపోతున్నాడని చింతించటంలేదు. తన మనో భావనని వ్యక్తపరచే అవకాశం ఇక రాదేమోనని మాత్రం చింతిస్తోంది. అతనిలో దైవాంశగుణాల్ని సహజదుర్బలత మరుగుపరుస్తుందేమోనని భయపడింది. తన కర్తవ్యాన్నుండి వేరైపోతున్నాడేమోనని దుఃఖించింది.

చల్లగాలి కోసం తోటలోకి బయల్దేరింది. తోట మాలి వంగి మొక్కలికి గొప్పి త్రవ్వుతున్నాడు. మొక్కలు అతనిని దీవిస్తున్నాయి.

అతను నీళ్ళు పోస్తున్నాడు.

అవి ఆనందంతో ఊగిసలాడ్తున్నాయి.

“తాత అంటే వాటికి ఎంత ప్రేమ” అనుకొంది శాంత. శాంత దృష్టి మరల్చింది. రోడ్డుమీద శేఖర్, విమల టాక్సీ ఎక్కుతున్నారు. ‘హార్బర్ కెళ్ళలేదు లావుంది’ అనుకొంది. ‘శేఖర్‌తో ఆమె ప్రేమ ఎలాంటిదో.”

తన పిచ్చి ఆలోచన శాంతకే నవ్వు తెప్పించింది. “ప్రేమ ఎలాంటిదో ఏమిటి.”

ఏదో ఆలోచిస్తూ చాలసేపు కూర్చునిపోయింది. ఇక అక్కడ వుంటే ఆలోచించడం తప్ప ఏమీ జరగదని రూమ్‌కి బయల్దేరింది.

గదిలో దీపం వెలుగుతోంది. విమల, శేఖర్లు వచ్చారనుకొంది. తలుపు ఓరగా వేయడంవూలాన మాటలు గట్టిగా వినపడ్తున్నాయి.

“నువ్వు లేకపోతే నేను బ్రతకలేను.”

“అక్క కూడ నువ్వు లేకపోతే బ్రతకలేదు.”

"'కాని శాంతని నేను ప్రేమిస్తున్నానో లేదో నాకే తెలీదు. నువ్వు రాని క్రితం వేరు."

"లేదు శేఖర్! అక్క నిన్ను గాఢంగా ప్రేమిస్తోంది. నాకు ముందఆ తెలిసివుంటే నేను మద్రాసు అప్పుడే వెళ్ళిపోయేదాన్ని.

"అయిందేదో అయిందిలే."

"ఇంకా ఏం జరగలేదు బావా!"

"ఏమిటి" – శేఖర్ ఆశ్చర్యపోయాడు సంబోధన విని.

"మీ వివాహము."

"దీనివల్ల నీకు నాకు శాంతకి ఎవరికీ సౌఖ్యం లేదు."

"అక్క కోసం ఈ మాత్రమేనా చేయనీయి."

"మన వివాహాన్ని శాంత ఆమోదిస్తుంది. ఆమె దేవత."

"వద్దు నే రేపు మద్రాసు వెళ్ళిపోతున్నాను. నన్ను మర్చిపోండి. వీలవుతే క్షమించండి. నాతో ఎలాగు వుండేవారో అలాగే అక్కతో..." విమల రుమాలుతో కళ్లు వత్తుకొంది.

శాంత విమల విషయంలో మొదటిసారి ఆశ్చర్యపోయింది. ఆమెని ఒక సాధారణ స్త్రీగా చూసినందుకు చాల కించపడింది. ఆమెకిప్పుడు ప్రపంచమంతా హితైకాంక్షులు. కొన్నిగంటల క్రితం వరకు ప్రపంచానికి మరోపేరు మోసం. ఇప్పుడు అది అమృతంగా పరిణితి చెందేటప్పటికి ఆమె ఆనందానికి హద్దులేకపోయాయి.

♦ ♦ ♦

మర్నాడు పత్రికలన్నీ గగ్గోలుగా అరిచాయి శాంత అనే మెడికల్ విద్యార్థిని సముద్రంలోపడి మరణించిందని.

విమల శేఖర్ పోలీసు స్టేషన్‌కి వెళ్ళారు. శాంత వ్రాసిన వుత్తరాన్ని గుర్తుపట్టారు.

శేఖర్ ఉత్తరం చూసాడు.

నా మరణానికి నేనే చింతించనప్పుడు మీరు చింతించడం అనవసరం. మీ అభివృద్ధికి దోహదమిచ్చే ప్రయత్నం నేనెక్కడున్నా చేస్తా!

ప్రేమయొక్క నగ్నస్వరూపమే త్యాగం. నిజమైన ప్రేమలో నవీనత తొణికిసలాడ్తూ వుంటుంది. చంద్రుని మనం నిత్యం చూస్తూవుంటాము. అయినా మనకూ చంద్రునిలో నూత్నత గోచరిస్తూ వుంటుంది.

ప్రేమ భగవంతుని స్వరూపం. అసలైన ప్రేమ భగవంతుని ప్రతినిధి. ఆ సంపద ఒకే ఒకడైన పరమేశ్వరుని దైనపుడు, ఆ జీవి అందరిలోను వున్నప్పుడు, ఆ సంపదని అందరికి పంచిపెట్టడం అవసరం. అందుకని మీ రచనల ద్వారా ఈ ప్రేమతత్వాన్ని లోకానికి అందచేయండి.

మీతోటి ఎప్పుడు మాట్లాడినా అసంపూర్తిగా మాట్లాడేదాన్ని – క్షమించండి.

మీ ఇద్దరికీ చేతులు కల్పే అవకాశం నాకా భగవంతుడివ్వలేదు.

విమల్ని మీ దగ్గిరికి చేర్చుకోండి_"

రెండు కన్నీటి బిందువులు శబ్దం చేసుకొంటూ కాగితంమీదనుంచి రాలాయి శేఖర్ కంట్లోంచి.

విమలా! శాంతయొక్క సందేశం ప్రతి హృదయానికి ప్రసరించేటట్లు చేస్తాను. నా కథలలో మహత్తర 'ప్రేమ' తత్వానికి నాంది పాడిస్తా. మన కళ్యాణం అప్పుడే..."

శేఖర్, విమల బయటికి వచ్చారు.

పోలీస్ స్టేషన్ తలవంచుకొని వెనక్కి వెళ్ళింది.

"ఈ స్టేషన్ నే కాదు ప్రపంచాన్నంతా తలవంచుకునేటట్లు చేస్తాను" – అనుకొన్నాడు శేఖర్.

# శ్రీ కృష్ణ కర్ణామృతము

(ఆంధ్రానువాదము)

ప్రథమాశ్వాసము

కవిభూషణ శ్రీ కల్లూరి అహోబలరావు



(గతసంచిక తరువాయి)

౧౭

కమలావనములోనఁ గాళింది ప్రవహించు
నందు, రాయంచ లానందముగను
మధుర ధ్వనుల సల్పు - మంజుల వైఖరి
నా శబ్దముల మించి - యతులితముగ
రతనపుటందియల్ - రాణించి మొరయగా
గోపాలకృష్ణుండు - గుతుకమలర
నడయాడుచున్నాడు - నందుని వ్రేపల్లె
వీథులలోఁ జాల - వేడ్కతోడ
నతని యందెల చప్పుడే సతమునాదు
వీనులకు జొరఁబడి కడు విందొసంగు ;
మానసాహ్లాద మొనరించు ; మమతతోడ
బాలగోపాలు స్మరియింతు - భక్తిఁ గల్గి.

౧౮

తరుణారుణము, దయాకరము, దీర్ఘములైన
వెడలుపుఁ గన్నుల - బుడుతకాఁడు,
కలశంబులను బోలు - గమలాకుచంబులఁ
బులకలు గల్గించు - కులుకులాఁడు,
మురళీరవంబుచే - మునుల మానస కమ
లముల, విప్పఁగఁ జాలు - లలిత
యశుఁడు,
మధురాధరామృత మహిమచే, 'వల్లవీ
జనములఁ దనిపెడు సరసమూర్తి ;
అమృతరూపుండు, పరమాత్ముఁడాది
రూపుఁ
డాలకాపరి గోపాల బాలకుండు ;
పొలుపుగా, నాదు సంతోషపూర్ణమైన
చిత్తమందుఁ గ్రీడించుచుఁ జెలఁగుగాత !

౧౯

అందమౌ కనుదమ్ము - లరమోడ్చి, వ్రేతల
సంబరంబునఁగాంచి - సంతసమున
వేణునాదామృత వృష్టి - మాధుర్యంబు
గోపకాంతల కిచ్చి - కూర్చివార
లానంద బ్రహ్మంబు-ననుభవింపఁగ, బాల
కృష్ణుండు, దమితీరఁ గృపసెలంగ
మఱిమఱి, వేణువు - మాధుర్య రుచులచేఁ
గర్ణామృతమొనర్చి - గారవమునఁ
జెప్పరానట్టి శృంగార చేష్టలందు
వ్రజ వధూమణులను ముంచు - రక్తితోడ
నట్టి గోపాలబాలకుం డార్తిహరుడు
నాదు మదిలోన మెలఁగు, ననారతంబు.

౨౦

కరవలయంబులు - ఘులుఘుల్లు మనుచుండ
జాఱిన దోవతిఁ జక్కనొత్తి
కుంతలములఁ దిద్ది-కొమరొప్ప, నెమిలి పిం
ఛమును, సింగారంబు - సలిపి, వేగ
రతిశయ్యనుండి, శ్రీపతి లేవగాఁ బోవఁ
బ్రియురాలు కౌఁగిలిఁబెట్టి, సన్న
సేయ, సుళువెఱింగి - తోయజాక్షిని, రతి
క్రీడల, మఱల సుఖింపఁజేసి
నట్టి, జారశిఖామణి, యెట్టయెదుటఁ
గానఁబడుచున్నవాఁడు, నా కన్నులకును ;

మనన మొనరించి, ధ్యానించి - మమతఁ
బెంచి
ప్రార్థన మొనర్చి, స్తుతియించి -
పాడుకొందు.

౨౧

విసెడివారలకెల్ల వీనుల కింపైన
గొల్ల గుబ్బెతల, పల్కులను వినుచుఁ
గల్ల నిద్దురసేయు - నల్లని కృష్ణయ్య
పెదవుల, ముదములు గదలియాడ
ముసిముసినవ్వుల - మురిపెంబులన్నాపు
కొంచు, నప్పుడపుడు - గొంతగొంతి
కనులు, విచ్చుచు, గొల్ల - వనితలఁ
గాంచుచుఁ
ప్రేమోదయంబునఁ బ్రియము జిలుక
దేహమున, గగుర్పాటులు-దెల్లముగను
కల్గియున్నట్టి శ్రీకృష్ణు - కల్లనిదుర
ధ్యానమొనరించి, కనుమోడ్తు - తమక
మొసగ;
చిన్మయానందకరమైన - సిద్ధిగొఱకు.

౨౨

రకరకంబులుగాఁగ - మకరికాపత్రముల్
గలిగిన ప్రాయంపుఁ గన్నెల, చెలు
వములైన, గబ్బిగుబ్బలకు, మధ్యమెలంగు
చుందువు; లేకున్న - సుందరాంగ!
యోగుల చిత్తంబు - రాగాన్వితము; వారి
మనములలో నుందు వనఘ! లేక
బృందావనముల, శ్రీకృష్ణ! సంచారంబు
సలుపుచుందువు నీవు! జలజనయన!
ఈ స్థలములందుఁ గాకున్న - నెలమి నీదు
దర్శనంబొందు దొఱకదు; దయదలిర్ప
నీదు రూపంబుఁ జూపుము - నీరజాక్ష!
నందనందన! గోపాల! - సుందరాంగ!

౨౩

అమృతములను జిందునట్టి వేణుస్వర
మొలుకఁజేసి, ప్రజను ముదమొసంగి,
చక్కనయ్యలందుఁ జక్కనివాఁడైన
నల్లనయ్యఁదలఁతు - నుల్లమందు.

౨౪

నెమ్మిపురిఁ దాల్చినట్టి, పున్నముల పంటఁ
దేనెలొలికెడి, చిఱునవ్వు నీనుదంటఁ
గన్నులకుఁ జలువలొసంగు వెన్నయుంటఁ
గంటఁ గాంచెదునట్టి భాగ్యమెపుడొకొ?

౨౫

బాల్యవైభవము, జవ్వనము, ప్రారంభంబు
బంగారు రూప సంపదలవాఁడు,
కరుణా ప్రపూర్ణ సంబరము; విలాసంబు
కర్బురంబగు, కటాక్షముఁ వాఁడు,
శ్రీకృష్ణ చంద్రుండు - చిన్మయానందుండు
జగముల రక్షించు - సాహసుండు,
ఆశ్చర్యమగు, మేని - యందంబుఁ
గలవాఁడు
గొల్లకాంతల ప్రేమఁ గొన్నవాఁడు,
నాదు నేత్రములకు - మోదంబొసంగుచుఁ
గానఁబడెడిగాత! వేణువూదు
కొంచు, నటనమాడుకొంచు, బ్రియము
లాడు
కొంచు, దరికిఁ జేరుకొంచు వేగ.

౨౬

యమునయందుఁ గువలయ, దళంబు
లతుల, శ్యా
మలములు, సొగసుల నెలవులట్లు
శోభించు కడగంటి చూపులు, శ్రీకృష్ణుఁ
డెపుడు, నాపై - ప్రసరింపఁజేయుఁ
గరుణాతరంగ సంబరము, మనోహర
మా కటాక్షంబెప్డు - హాయినొసఁగు!

హారజటాజూట, సుధాంశు శీతల, ముర
ళీ, నినాదంబెప్డు - లీలతోడ
మానసానంద మొనగూర్చు? మఱపురాని
నల్లనయ్య రూపము, సదానయనములకుఁ
గానఁబడును? సంతోషసౌఖ్యంబులెపుడు
కలుగునో? యంచుఁ జింతింతుఁ దలఁపు
సందు.

౨౭

తియ్యఁ దియ్యని బల్కులు, దీపిచూపు
లతుల యొయ్యారమున, నడయాడుచున్న
మందగమనంబులహ్వారె! నందనంద
నా! ప్రియంబగు; వ్రేపల్లె నాతులెపుడు
నీదు కౌగిలి సుఖము వర్ణింత్రు; మోహ
జనకమైన, నీ చిఱునవ్వుఁ జప్పరింత్రు;
కీర్తనల సల్పుచుంద్రు; శ్రీకృష్ణ! భక్త
వరద! సాక్షాత్కరింపవే - పంకజాక్ష!

౨౮

పొంగెడి చిఱునవ్వు - రంగులు గలవాఁడు
వెడఁద కన్నులుగల్గు - వేడ్కకాఁడు
గబ్బిగుబ్బల గొల్లకాంతుల, నిండు చ
న్నుల చేత నొక్కఁగా - వెలయువాఁడు
మబ్బు జిగినిమించు - మలయుజ, కర్పూర
మిళిత శరీరంబుఁ గలుగువాఁడు
మూడు లోకంబుల - ముంచు, మోహన
మైన
తేజంబుతో, ముద్దుఁ దెచ్చువాఁడు
చక్కనయ్య; తీపిచక్కెర బమ్మయ్య!
నల్లనయ్య! అల్లనల్లఁ దిరుగు
మాధవయ్య! మధుర-మంజుళ, వేణు స్వ
రంబులయ్య! వేగ - రాగదయ్య!

౨౯-౩౦

చెవుల పండువులు, వంశీనినాదంబులు
గడగంటిచూపులు, గండచక్క-
రలు; ఓయి! శ్రీకృష్ణ! రాధామనోహరా!
నీ ప్రాపులేకున్న - నిలువనేర
కరుణాసముద్ర! సంకటనాశనా! కేలు
జోడించి, యెలుఁగెత్తి వేడువాఁడ
నెవ్వరి దయయున్న నేమగు? నీ యండ
లేనిచో? నీ యండఁ బూనియున్న
నొరుల దయయేల? గోపాల! సరసిజాక్ష!
నీ కటాక్షామృతము గొంత - నెనరుఁగల్గి
నాపయి, స్రవింపఁజేయుమో-నాగశయన!
నందనందన! కొనుము; నా వందనములు.

(సశేషము)

# నలిగిన హృదయాలు

శ్రీమతి పరానేని శ్రీశైలభ్రమరాంబ

తనకి చదువుకోవడానికి ఇష్టంలేదని వ్రాసినా కూడా మామగారు మళ్ళీ చదువులో చేరమనే ప్రోత్సహిస్తూ వ్రాసిన జాబు చూచి గిరిజ మనస్సు వికలమైపోయింది. ఇంక తనే స్వయంగా వెళ్ళి చెప్పి రావాలనుకొంది. తనతో కూడా తండ్రి సహాయంగా వచ్చి అన్నీ మాట్లాడి శుభకార్యము ఏర్పాటు చేస్తానన్నాడు.

"ప్రసాద్! మా అన్నయ్య గిరిజను తీసుకువస్తున్నట్లు జాబు వ్రాశాడు. ట్రయిన్ వచ్చే టయిముకి మీ నాన్నగారు కోర్టులో వుంటారు. మన కారు తీసుకు నువ్వే వెడతావా స్టేషనుకి?" అంది అన్నం వడ్డిస్తూ పద్మావతి.

గిరిజ కూడా వస్తోంది అన్నమాట వినేసరికి ఒక్కసారిగా ఉలిక్కిపడ్డాడు ప్రసాద్. కాని అంతలోనే తన ఖంగారు అణుచుకుని "నాకు వీలు కుదరదమ్మా! పోనీ నువ్వే స్టేషన్‌కి వెళ్ళి తీసుకువస్తే బాగుంటుందనుకొంటా!" అన్నాడు.

అత్యంత ఉత్సాహంతో అంగీకరిస్తాడని ఆశించిన తల్లికి కొడుకు మాట వినేసరికి పిడుగుపడ్డట్లు అయింది. మనస్సులో కోపాన్ని ఆపుకోలేక "తండ్రి గడించిన సొమ్ముతో అందరికీ వైద్యం చెయ్యడం, ఇల్లు పట్టకుండా తిరగడమే కాని; పై సంపాదన మాత్రం లేదు. రాకరాక మన యింటికి వాళ్ళింతట వాళ్ళే వస్తున్నా స్టేషన్‌కి వెళ్ళి గౌరవంగా తీసుకొచ్చేందుకు కూడా తీరుబడే నీకు లేదన్నమాట!" అంది ముఖం కందగడ్డలా చేసుకుని.

"మనల్ని నమ్మి మన దగ్గర కొచ్చేవాళ్ళమీద కనికరం చూపించకపోతే మనలో మానవత్వం అనేది ఎక్కడుంటుందమ్మా!" అన్నాడు ప్రసాద్.

"నేననేది అది కాదు. పుట్టెడాశతో వచ్చే గిరిజకు నువ్వు కన్పిస్తే అదెంత సంతోషిస్తుందో తెల్సుకో. నీ కోసం వస్తోంది కాని మా కోసం కాదు కదా!" అని పద్మావతమ్మ ఇంకా ఏదో చెప్పబోతూ ఉండగానే కామేశ్వరరావుగారు అడ్డొచ్చి "పోనిద్దూ! వాడికి తీరిక లేకపోతే నేనే ఆగిపోతా. మనిద్దరం వెళ్ళి తీసుకువద్దాం" అన్నాడు భార్య ధోరణికి అడ్డుకుని.

భర్తని ఎదిరించలేక ఆ యిల్లాలు మూతి ముడుచుకు వెళ్ళింది. తండ్రీ కొడుకు లిద్దరూ భోజనాలు పూర్తయి లేచారు.

ప్రసాద్ స్వంతకారులో కామేశ్వరరావు ఆయన భార్య స్టేషనుకి వెళ్ళి గిరిజని, తండ్రిని వెంటబెట్టుకు వచ్చారు. తను వచ్చేసరికి ప్రసాద్ కనిపిస్తాడని ఒళ్ళంతా కళ్ళుచేసుకుని చూసింది. గిరిజ ఇల్లంతా తిరిగింది. మేడ ఎక్కి చూచింది. కాని అతని జాడే లేదు. మధ్యాహ్నం రెండు గంటలకి కాఫీ, ఫలహారాలు రెడీ అయ్యాయి. గిరిజకి మాత్రం తినబుద్ధి కాలేదు. అల్లాగే మేనత్త ముఖంలోకి చూస్తూ కూర్చుండిపోయింది. అది గ్రహించిన పద్మావతి "అబ్బాయి టైమ్‌కి రాడమ్మా! వాడికి ఎప్పుడు తీరుబడి అయితే అప్పుడు వచ్చి, కాఫీ టిఫిన్ తీసుకుంటాడు. నువ్వు పుచ్చుకో" అని బలవంతపర్చడంతో విధిలేక కాఫీ మాత్రం త్రాగింది గిరిజ.

కొండలరావు బావమరదితోనూ, చెల్లెలితోనూ కబుర్లు చెబుతూ కూర్చున్నాడు. గిరిజ కూడా అక్కడున్నదన్నమాటేగాని ఆమె దృష్టంతా ప్రసాద్ వైపుకే పోతోంది. అల్లా ఎంతసేపు గడిచిందో వారు కబుర్ల ధోరణిలో గుర్తించకపోయినా వంటమనిషి పిలుపుతో టైమ్ చూచుకున్నారు. అప్పటికే రాత్రి ఎనిమిది గంటలైంది. "లేవండి అన్నయ్యా! ప్రొద్దు పోతోంది. ఇంటి దగ్గర ఎప్పుడు తిన్నారో ఏమో!" అని పద్మావతమ్మ హెచ్చరించింది.

"ప్రసాద్ కూడా రానియ్యండి" అన్నాడు కొండలరావు.

"ఆ! వాడికోసం కూర్చుంటే అయినట్టే ఒకొక్కప్పుడు పగలు రెండు మూడు అవుతుంది. రాత్రిళ్లు పది పదకొండు కూడా అవుతుంది. ఇవ్వాళ మాత్రం వాడు నాతోబాటు పదింటికే తిన్నాడు" అంటూ కుర్చీలోంచి లేచాడు కామేశ్వరరావుగారు.

"గిరిజా! నువ్వుకూడా రా అమ్మా!" అంది సాదరంగా.

"నాకప్పుడే ఆకలిలేదు అత్తయ్యా! పది అయినాగాని వుంటాను" అంది గిరిజ.

కోడలు మనస్సును గ్రహించిన పద్మావతమ్మ ఇంకేమీ అనలేకపోయింది. భర్త, అన్నగారు వంటింట్లోకి వెడుతూంటే తనూ వాటితో కూడా వెళ్ళింది.

వంటింట్లో వారు భోజనాలు చేస్తుంటే గిరిజ తిన్నగా మేడమీదికి వెళ్ళి ప్రసాద్ పడుకునే గది తలుపు తెరిచింది. గదిలోవున్న ప్రసాద్ ఫోటోని రెప్పవాల్చకుండా చూస్తోంది. విశాలమైన ఫాలం, ఉత్సాహాన్ని వెదజల్లే ఆ ముఖం, వెలుగును వెదజల్లే కాంతివంతమైన ఆ పెద్దపెద్ద కళ్ళూ, బుద్ధికుశలతను తెలియచేసే ఆ సూదిమొనగల ముక్కు, చంద్రవంక వలెనున్న ఫాలానికి ఆ నిండైన క్రాఫు, చిరునవ్వులు చిందించే ఆ పెదిమలు, కండలు తిరిగిన దండలు, వెడల్పైన ఛాతీ, పొడవైన భారీ విగ్రహం, ఆ ప్రసాద్ ఫోటోని తనివితీరా చూచి తృప్తిగా నవ్వుకొంది గిరిజ. తన బావ ఎంతో బలిష్ఠుడు. సుందర స్వరూపుడు. అతని సుందరరూపమే ఎప్పుడూ తన హృదయంలో హత్తుకుపోయి, అతని నామాక్షరాలే హృదయంలో జపిస్తూ, అతన్నే దైవంగా భావించుకుంటూ చదువంతా పూర్తిచేసింది. తన బావ ఇప్పటికి చదువంతా పూర్తిచేసి బాధ్యతాయుతమైన డాక్టరుగా పనిచేస్తున్నాడు. తన బావని చూచి పంచవర్షాలైంది. ఇంక బావని క్షణమైనా వదలకుండా వుండచ్చు. ఇప్పుడే బావ వచ్చి తన దగ్గరగా వచ్చి తనని గిరిజా! అని పిలిస్తే... ఒక్కసారిగా అల్లా తల్చుకునేసరికి ఒళ్ళు పులకరించింది.

తను వస్తూన్నట్లు తెలిసీకూడా బావ ఎందుకు రాలేదు? పోనీ మధ్యాహ్నం పన్నెండు గంటలకే తాము వస్తామని ముందే వార్త తెల్పుకుని కూడా ఇప్పటివరకూ ఒక్కసారైనా దర్శనమివ్వడానికే బావకి తీరికలేకపోయిందా? ఏమిటో! డాక్టర్లకి అసలు తీరికే చిక్కదేమో! బావ ఇంటర్ చదివే రోజుల్లో తనూ బావా ఎంత సరదాగా వుండేవారు! శలవులకి తమ యింటికి వస్తే తన షికార్లకీ, సినీమాలకీ తీసుకువెళ్ళేవాడు. తననీ బావనీ చూచి అత్తయ్యా మామయ్యా ఎంతో మురిసిపోయేవారు.

గిరిజ ఆ గదిలో కూర్చుని అంతులేని ఆలోచనలతో సతమతమౌతోంది. అంతలో అత్తయ్యా వచ్చి "గిరిజా!" అని పిలవడంతో తన ఆలోచన తోరణం తెగింది. మామయ్యా, నాన్న కూడా "బ్రేవ్" మని త్రేనుస్తూ మేడమీదికే వచ్చారు. మామయ్య "గిరిజా! నువ్వుకూడా భోజనం చెయ్యమ్మా! అబ్బాయి కోసం కూర్చుంటే చాలా ప్రొద్దు పోతోంది" అంటూ చెబుతూ గదిలోకి వచ్చారు.

"నువ్వు తినెయ్యి అత్తయ్యా! నేను పది అయినాగాని వుంటాను" అంది వ్యంగ్యంగా.

"గిరిజా! ఈ పూటకి తినెయ్యమ్మా! రేపు అబ్బాయి వచ్చేవరకూ వుండొచ్చు" అంటూ పద్మావతమ్మగారు గట్టిగా బలవంతపర్చడంతో గిరిజ యింక కాదనలేకపోయింది. మనస్సులో ఏదో తప్పు చేస్తున్నట్లు బాధపడ్తూనే భోజనం ముగించి లేచింది.

రాత్రి అందరూ నిద్రపోతూన్నా బావ రాక కోసం ఎదురుచూస్తూ గిరిజ మాత్రం హాల్లో సోఫాలో కూర్చొంది. రాత్రి పన్నెండు గంటల ప్రాంతంలో కారు వచ్చి పోర్టికోలో ఆగింది. బాగా అలిసిపోయి నిద్రమత్తుతో తూలిపోతూ ప్రసాద్ హాల్లోకి వచ్చాడు. ఒక్కక్షణం ఒకరు ముఖంలోకి ఒకరు ఆశగా చూచుకున్నారు. "బావా!" అని అప్రయత్నంగా తన నోటంట వచ్చేసింది —

"యీ వేళ నాలుగు డెలివరీ కేసులొచ్చాయి. అందుచేత ఇంతవరకూ నాకు క్షణంకూడా ఖాళీ చిక్కలేదు. నువ్వూ మామయ్యా వచ్చినట్లు అమ్మ కబురుచేసినా హాస్పత్రి వదలడానికి అవకాశం లేకపోయింది. మరోలా అనుకోకు గిరిజా!" అంటూ సోఫాలో కూర్చున్నాడు ప్రసాద్. అతనికి ఎదురుగా నిల్చునేవుంది గిరిజ.

"బావా! నీకోసం..." అంటూ ఏదో చెప్పబోయింది గిరిజ.

"ఇల్లా కూర్చో గిరిజా!" అన్నాడు చిరునవ్వుతో ప్రసాద్.

గిరిజ ప్రసాద్‌కు ఎదురుగా కుర్చీలో కూర్చుంది.

"గిరిజా! నువ్వు బి.ఏ. ఫస్టు క్లాసులో ప్యాసైనందుకు ఎంతో సంతోషించా. యం.ఎ. కూడా అల్లాగే ప్యాసవ్వాలి అని ఆశిస్తున్నా" అన్నాడు ప్రసాద్.

"ఇంక నాకు చదువుకోవాలనిలేదు బావా!" అంది గిరిజ.

"అదేమిటి గిరిజా! అవకాశమున్నప్పుడు చదువుకోకపోతే తర్వాత చదువుకోవాలన్నా సాధ్యమౌతుందా?"

(సశేషము)

# భౌతికత నాధ్యాత్మికత ద్వారా జయింపుము!

మూలము:
శ్రీ శివానంద భగవానులు
హృషీకేశము

అనువాదము:
శివానందపాదసేవక్
శ్రీ స్వామి శ్రీనివాసానంద సరస్వతి



ప్రతియొక మరణించుచున్న భౌతిక వాదియొక్క ఆఖరి యోచనను గుర్తింప గలిగెడి కొండొక పనిముట్టు యీరోజున లభ్యమగుచో మీరేకీభావతను కనుగొనుట కాశ్చర్యపడుదురు. వారందఱు "అయ్యో! నా కాలమును నీడ (ఛాయ) వెంబడి పరుగెత్తి వృధాపుచ్చితిని. నీడ (అసద్వస్తువు)కై వినియోగించిన కాలములో నూఱవ వంతు వాస్తవిక తత్త్వము (సద్వస్తువు)నకు వినియోగించి యుండిన నా మార్గమిప్పటికి విరాజమానమై యుండుటను కనుగొని యుండెడి వాడను" యని మనోభావ మొందుదురు.

భౌతికత (ప్రాపంచికత) యొక్క వ్యామోహత గూర్చి జాగ్రత్త! మీ హృదయములో దానికాశ్రయ మివ్వకుము. వెలుపలికి చూచి, గమనింపుడు. ఎవరైతే సంపత్తిని పెద్దగ పొగడిరో వారే దానిక్రింద మూలుగుదురు. ఎవరైతే (విషయ) సుఖము నన్వేషించిరో వారే తుదిని బాధతో గిలగిలలాడుదురు. అది వాటి దోషము కాదు. అది యింద్రియ విషయముయొక్క స్వభావము. కాన జాగ్రత్త. ప్రాపంచికతనుండి నిశ్చయముగ మఱలుడు. రండు, అవినాశజ్ఞానమున నానందించు నాధ్యాత్మిక పురుషుల మహిమాన్విత సంఘమున చేరుడు.

జ్ఞానప్రాంగణములో నదే (తొలి) ప్రవేశములోనే శాంతి, సంతోషముల నెడి కావలివాండ్రచే మీరభినందింపబడుదురు. అది వాస్తవిక జ్ఞానప్రకాశముచే దేదీప్యమానముగ విరాజిల్లుటను మీరు గనుగొందురు. మీ భారము కూడ తేలికయొనర్పబడును. జ్ఞానము మీ బిగింపులను (సంకుచితములను) వదులుచేయును. జీవితముయొక్క మూలము, అర్థము గమ్యముల మీరెరుగుదురు. ఈ జ్ఞానము పుస్తకముల నుండి ప్రోగుచేయు వృత్తాంతము నకు చాల యధికముగ పోలికలేనిది.

జ్ఞానప్రాంగణములో జ్ఞానమనుభవములో సరిసమానము. ఎవడీవిధముగ తెలిసికొనునో నాతడు దుఃఖ మోహముల కతీతముగ జనును. బాధ, అజ్ఞానము, కామము, అహంకారము, జననము, మరణముల చేరుదల కావల శాశ్వత సూర్యరశ్మి గల దేశములో నాతడుండును.

ఈ ప్రాంగణములోని కిటికీల గుండా ప్రజానీకము భౌతికత యనెడి ముసుగుచే నంధమొనర్పబడి బాధ యనెడి బురదలో తడుముకొనుటను మీరు గాంతురు. ఇప్పుడు వారిని లోనికి పిలుచుటకు మీరిప్పుడనుభవమొందు జ్ఞానము, ప్రకాశము, ఆనందముల పంచుకొనుటకు వారి నాహ్వానించుట మీ వంతైయున్నది.

భౌతికైశ్వర్యము లేదా దారిద్ర్యము యొక్క దుష్ఫలితముల నెదుర్కొనుటకు

తగు నుపాయములు సహజముగ నవాంఛనీయముగ పరిగణింపబడవు. ప్రజల శ్రేయస్సునకై భౌతికసంపత్తి యవసరము. ఆధ్యాత్మిక విలువల కడ్డంకుగ భౌతిక భోగమునెడ విపరీతాసక్తి మాత్రమే గర్హింపబడును. ఒక తెగగ భౌతికత వలయునంత చెడ్డది యేలన నది మానవునిలోని నైతిక సున్నితము (refinement) ను ధ్వంసమొనర్చును. మానవుడు రొట్టెచే మాత్రమే జీవింపజాలడు. ఆత్మయొక్క క్షుధ (ఆకలి) యనబడు గొండొకటి కూడ యున్నది.

ప్రజాకోటియొక్క ఆవశ్యకత భౌతిక, ధార్మిక విలువలయొక్క పునర్నిర్ధారణయే. సరిగ నేవిధముగనైతే భౌతికాభిలాషలు మానవునియొక్క నైతిక శ్రేయస్సునకు ప్రతికూలముగ పరుగిడకూడదో, నటులనే కూడ ధార్మిక విలువలు వాని భౌతిక శ్రేయస్సునకు విరుద్ధమవరాదు. ధార్మిక లేక ఆధ్యాత్మిక విలువలు నైతిక ప్రవర్తన, ఆత్మశిక్షణ ద్వారా జీవిత పాఠశాలలోనే కాని మందమైన, యాంత్రిక దివ్యకార్యకలాపముచే కృషి చేయబడవు. నైతిక పునాదియే ఆధ్యాత్మికతకు, సమస్త ఘనమైన సంపాదనలకు మూలకందమై బలుగును. దాని రాహిత్యతలో భౌతికతయొక్క వైపరీత్యము వృద్ధిచెందును.

జీవితపు లేతమొలక నిండుగ శక్తివంతముగ నుండును. దానిని జాగ్రత్తగై కొనుడు, అది గొప్ప వృక్షముగ పెరిగి యాశ్రయము, ఫలముల నొసగును. ప్రపంచమంతట యువకుడు నేడాధ్యాత్మికముగ పస్తుపడి యున్నాడు. భౌతికముయొక్క విషము ప్రజాకోటియొక్క ఉనికియొక్క కేవలసారమునే కలుషితమొనర్చుచున్నది. రోగనివారకౌషధమును శీఘ్రముగ కనుగొనుడు. యువకుల నైతికత, ఆధ్యాత్మిక విలువలలో శిక్షిత మొనర్పుడు. వారిలో సద్విదశ్యము విశ్వైక ధార్మిక నియమములగు సత్యము, అహింస, పావిత్ర్యత (బ్రహ్మచర్యముల) చొప్పింపుడు. యువకుల ధర్మమార్గము గుండా నడిపింపబడనిండు. దేశమునకు, విశాల ప్రజాకోటికి నెవడైన నొకడు చేయగలిగిన మహత్తమమైన దేశనిర్మాణ కార్యకలాపమిదియే.

భగవానుడు మిమ్ముల నాశీర్వదించుగాక! మీరందఱు దివ్యజీవనమును గడపి శాంతి, సద్భావనాశకము (లో)ను ప్రవేశపెట్టుదురుగాక!

హరిః ఓమ్ తత్సత్!

# ఆంధ్ర కేసరి టంగుటూరు ప్రకాశంగారి వర్ధంతి సమావేశము



మైలాపూరు నందలి శ్రీ పొట్టి శ్రీరాములు గారి స్మారకభవనమునందు 21-5-61 సాయంకాలము 6 గంటలకు జాతీయ ప్రేమ మండలి (మద్రాసు) యాజమాన్యమున శ్రీ॥ శ్రీ॥ టంగుటూరు ప్రకాశంగారి వార్షిక వర్ధంతి సందర్భమున శ్రీ వి. యల్. శాస్త్రి గారి అధ్యక్షతన సమావేశము జరిగెను. డా॥ కే. వి. స్వామి, జలగం సుబ్రహ్మణ్యంనాయుడు, జి. రాజమన్నారు, దేశు వెంకటసుబ్బయ్య శ్రేష్టి, వై. యస్. శాస్త్రి, బి. యస్. శర్మ, సి. సి. పున్నయ్య మున్నగువారు ఉపన్యసించిరి.

ప్రార్థన, భజన అనంతరం జాతీయ ప్రేమమండలి అధ్యక్షుడు శ్రీ యం. ఆర్. తిలక్‌గారు సభికులకు స్వాగతము చెప్పుచు జాతీయ శ్రేయస్సును, ప్రజాభ్యుదయాన్ని ఆశయ లక్ష్యాలుగా కృషి, త్యాగం చేసిన 'ఆంధ్ర కేసరి'ని బోలిన మహనీయులను స్మరించుటకు, వారి జీవిత మార్గాన్ని అనుసరించి సేవ జేయుటకు యిట్టి సమావేశము లవసరమనియు, మద్రాసులోని తెలుగువారు కలసికట్టుగా తమ స్వీయ శ్రేయో సౌభాగ్యముల దృష్ట్యా ఆసక్తితో కృషి చేయాలనియు, ఇట్టి కృషికి వివిధ ప్రాంతాల వారి మధ్య పరస్పర సహాయసహకారాలు అత్యవసరము అని చెప్పిరి.

డాక్టరు. కె. వి. స్వామి మాట్లాడుచు శ్రీ ప్రకాశంగారు సేవాత్యాగాలకు చిహ్నమనియు, ఆయన ధైర్యసాహసాలు, వ్యక్తిత్వము రాజకీయ రంగంలోను; నిర్మాణ కార్యక్రమాలలోను ప్రజలను ఉత్తేజపరచి ముందుకు నడిపినవనియు, స్వాతంత్ర్య, ఆంధ్రరాష్ట్ర ఉద్యమములను జయప్రదంగా నడిపి దిగ్విజయాన్ని సాధించిన వీరుడనియు, ఆయన ప్రకాశం తెలుగుదేశంలోనే కాక దేశం మొత్తం మీద ప్రతిఫలించి, జాతీయోద్యమాన్ని ద్విగుణీకృతం చేసిందంటూ వీరికి సముచితమైన స్మారకచిహ్నమును మద్రాసులో ఏర్పడకపోవుట లోటని అన్నారు.

శ్రీ జి. రాజమన్నార్‌గారుపన్యసించుచు ఎప్పటికప్పుడు ఉత్సాహపరచి, ఉత్సాహపరచే ఆంధ్రకేసరి వ్యక్తిత్వము, ధైర్యసాహసాలు, చిత్తశుద్ధి, విషయపరిజ్ఞానము, నిరాడంబరత్వము, త్యాగసేవాసక్తి చిరస్మరణీయములనియు, వీనితోబాటు వారి సమయస్ఫూర్తి హిందూ ముస్లిం కొట్లాటలులాంటి క్లిష్టసమస్యలను సులభంగా పరిష్కరించినవనియు, పరిపాలనాధ్యక్షత పేరొ్కనతగినదనియు, రాజకీయ రంగంలో ఆయన, ఆయన జీవితము ఆదర్శనీయములనియు చెప్పిరి.

శ్రీ జలగం సుబ్రహ్మణ్యం నాయుడు మాట్లాడుచు త్యాగిగా పేరొ్కనతగినవారిలో ముఖ్యుడనియు, స్వార్థమెరుగని కర్మయోగి యనియు, ఆయనకు ప్రజాదరాభిమానములే సంపదయనియు, ఇందుకు నిదర్శనము వారి కుటుంబపు యీనాటి నిస్సహాయస్థితియే యంటూ జీవిత విశేషాలను వివరించారు.

శ్రీ జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తిగారు ఉపన్యసించుచు చిత్తశుద్ధి, ఉత్తమ ఆదర్శ లక్ష్యాలు కలవారే మహనీయులనియు, చిత్తశుద్ధి, నిరాడంబరత్వము, పవిత్రతలతో మూర్తీభవించుటచేతనే శ్రీ ప్రకాశంగారు మహనీయుడైనాడనియు, త్యాగిగా, జాతీయవీరుడుగా, ప్రజానాయకుడుగా ప్రకాశంగారు ప్రజల హృదయాలను హరించాడని, ఆంధ్రుల ఏకైక నాయకుడగుటకు యీయన సుగుణాలే కారణాలన్నారు.

శ్రీ కాకరపర్తి భావనారాయణ శ్రేష్ఠిగారు సుప్రసిద్ధ జాతీయవాది, ప్రజాభ్యుదయాన్ని ప్రోత్సహించిన శ్రీ ఇస్నా వెంకట్రామయ్యగారి మరణ సందర్భమున సంతాప తీర్మానమును ప్రతిపాదిస్తూ, శ్రీ ప్రకాశంగారి నాయకత్వము జాతీయాభ్యుదయాన్ని ప్రోత్సహించుటతోబాటు అనేకులకు రాజకీయ, నిర్మాణ కార్యక్రమ రంగాలలో మార్గదర్శకం అయినదనియు, వారితో పరిచయం, సాన్నిహిత్యము మహదావకాశమన్నారు.

శ్రీ బి. యన్. శర్మగారు మాట్లాడుతూ తాను శ్రీ ప్రకాశంగారితో బాటు ఉప్పు సత్యాగ్రహం,

సైమన్ కమిషన్ రోజులలోను పనిచేసినవాడననియు, వారి నాయకత్వము, వ్యక్తిత్వము అజేయమైనవనియు, మద్రాసులోని తెలుగువారు తమ బాధ్యతలను గుర్తించి, స్వీయాభివృద్ధి నుద్దేశించి ఆసక్తితో ఉమ్మడిగా కృషి చేయవలసి యున్నదన్నారు.

శ్రీ వై. యస్. శాస్త్రిగారు ఉపన్యసించుచు శ్రీ ప్రకాశంగారి సుగుణాలు వర్ణనాతీతములనియు, పొట్టి శ్రీరాములుగారి స్మారకభవనం కొనుగోలుకు శ్రీ ప్రకాశంగారి ఆసక్తి, కృషి ప్రధానములనియు, వారి పరిపాలనాదక్షత ప్రజాభ్యుదయాన్నుద్దేశించినదనియు, ఈనాటి కాంగ్రెస్ లక్ష్యమైన సోషలిస్టు వ్యవస్థకు శ్రీ ప్రకాశంగారు ఉమ్మడి మద్రాసు రాష్ట్రానికి ప్రధానిగా ఉత్పత్తిదారుల, వినియోగదారుల సహకార సంఘాల స్థాపనతో పునాది వేసిరి కాని, ఆయన ఉద్దేశలక్ష్యాలు సిద్ధించకముందే అనేక సంకుచిత శక్తుల కలయికతో పదవీ విరమణ జరగడం దురదృష్టమన్నారు.

శ్రీ ప్రకాశంగారి ధైర్యసాహసాలు, ప్రజా శ్రేయస్సు పట్ల ఆసక్తి, త్యాగము, సేవ, స్వాతంత్ర్య సమరాన్ని, జాతీయోద్యమాన్ని, ఆంధ్ర రాష్ట్రోద్యమాన్ని శరవేగంగా నడిపినవనియు, ప్రజానాయకుడుగా ఉండవలసిన గుణాలన్నీ ఆయనలో మూర్తీభవించి యుండినవనియు, ఆయన ఆరాధనీయుడు, అనుసరణీయుడంటూ శ్రీ శాస్త్రిగారు సేవాత్యాగాలకు, ధైర్యసాహసాలకు ఆదర్శనీయుడైన శ్రీ ప్రకాశంగారి జీవితాన్ని, ఆయన ఆదర్శ లక్ష్యాలను స్మరించి అనుసరించుటకనువుగా మద్రాసులో ఒక సముచితమైన స్మారకచిహ్నం ఏర్పాటు కావాలనియు, ఇందుకుగాను నగరంలోని తెలుగువారు, తదితరులు కృషి చేయాలనియు, ఈ కృషికి ప్రాథమిక సంఘం ఏర్పడాలనియు, ఈ ప్రయత్నానికి కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు తోడ్పడవలసినదిగా కోరుతూ ఒక తీర్మానాన్ని ప్రవేశపెట్టారు.

ఈ తీర్మానాన్ని 'గృహలక్ష్మి' సంపాదకుడు శ్రీ సి. సి. పున్నయ్యగారు బలపరుస్తూ త్యాగి, అమరజీవి శ్రీ పొట్టి శ్రీరాములుగారి స్మారకభవనంలో శ్రీ ప్రకాశంగారి వర్ధంతి సమావేశం జరుగడం మహాదౌకాశమనియు, ప్రకాశంగారిలోని ఉత్తమ గుణాలు, నిరాడంబరత, చిత్తశుద్ధి, పవిత్రత యీనాడు నాయకులలోను, ప్రజలలోను లేకపోవుట దురదృష్టమనియు, నాయకత్వంలో లోటుకు యిదే ప్రధాన కారణమనియు, ప్రకాశంగారి త్యాగం, సేవ, వీరోచిత పోరాటం, నాయకత్వమువల్ల మనం జాతీయరంగంలో సాధించిన ఘనవిజయాలు చిరస్మరణీయాలనియు, వారికి సమకాలికులంగా మన అనుభూతి, అనుభవాలు ఉత్తేజపరచి ఉత్సాహపరచునవని 'స్మారకచిహ్నం' తీర్మానమును ఏకగ్రీవంగా ఆమోదించవలసినదిగా సభికులను కోరిరి.

అధ్యక్షోపన్యాసంలో శ్రీ వి. యల్. శాస్త్రిగారు ప్రకాశంగారి జీవిత విశేషాలు ప్రజలకు అనుక్షణం మార్గదర్శకములంటూ వారికి గల కృతజ్ఞతాభావం పేర్కొనతగినదనియు, స్వరాజ్య పత్రికా స్థాపన, నిర్వహణ సందర్భమున ఆయన చేసిన త్యాగం, యితరులచేత చేయించిన త్యాగం, పేర్కొనతగినవనియు, సంపాదన, ఖర్చుచేయడం తెలిసినవాడనియు, వారి విషయపరిజ్ఞానం, చిత్తశుద్ధి, ప్రజాదరాభిమానాలపట్ల విశ్వాసము ఏకైక ప్రజానాయకుడుగా రూపొందించినవనియు, ఆయన, ఆయన నాయకత్వము అనుక్షణం ప్రజలను ఉత్తేజపరుస్తూ, ఉత్సాహపరుస్తూ కార్యనిర్వహణారంగంలో ముందుకు నడిపినవనియు, ఆయనతో పని చేయడం మాబోటివారలం మహాభాగ్యంగా భావిస్తున్నామనిరి.

శ్రీ సి. సి. పున్నయ్యగారి వందన సమర్పణముతో సమావేశం ముగిసింది.

# శ్రీ సాయిబాబా సందేశవ్యాప్తి



అనేకమంది భక్తుల ఆహ్వానాన్ని మన్నించి శ్రీ సాయిబాబా భక్తులు స్వామి కేశవయ్యజీ మే నెల 10 వ తేదీన బెంగుళూరుకు బయలుదేరి వెళ్ళారు. అక్కడ అనేకచోట్ల పూజలు సలిపి, విభూది ప్రసాదములతో శ్రీ సాయిబాబా కరుణాకటాక్షములను, ఆశీస్సులను వందలకొలది భక్తులకు పంచిపెట్టారు. శ్రీ బాబా బోధనలను తమ సందేశం ద్వారా వినిపించి భక్తివిశ్వాసములను ప్రోత్సహించారు. 11 వ తేది గురువారం నాడు వర్తకప్రముఖులు శ్రీ ఏ.ఆర్. రాధాకృష్ణన్ గారి యింట్లోను, 18 వ తేది నాడు ఉదయం శ్రీ యల్. కామేశ్వరరావు గారి యింట్లోను, సాయంకాలం Capt. డా॥ యం. ఆర్. శ్రీనివాసన్ గారి యింట్లోను, మరునాడు ఉదయం శ్రీ యస్. కే. సుందర్ రాజ్ గారి యింట్లోను, తరువాత డా॥ యస్. ఆర్. గోరూరు గారింట్లోను, సాయంకాలము శ్రీ కె. యస్. ప్రకాశంగారింట్లోను పూజారాధనలు సలిపి స్వామీజీ విభూది ప్రసాదములను, తీర్థమును పంచిపెట్టి రాత్రి డా॥ గురుమూర్తి దంపతుల ఆహ్వానంపై వారింటికి వెళ్ళి విభూది ప్రసాదముల నిచ్చి, రాత్రి శ్రీ డి. రాజగోపాల్ నాయుడు గారింట్లో పూజచేశారు.

మైసూరు మంత్రి శ్రీ H. S. రుద్రప్ప, శ్రీ A. R. బదరీనారాయణ్, M.L.A. తో వచ్చి గోకులం కాలనీలో స్వామి కేశవయ్యజీని వారి బసలో కలసికొని మాట్లాడిరి. వారికి స్వామీజీ విభూది ప్రసాదములను, శ్రీ సాయిబాబా చిత్రములను కొన్నింటిని యిచ్చిరి. క్రిందటి సంవత్సరం స్వామీజీ షిమోగా వెళ్ళినప్పుడు శ్రీ రుద్రప్పగారు మంత్రి కాగలరని చెప్పియుండిరి.

స్వామీ కేశవయ్యజీ గోకులం కాలనీలో బస చేసినంతకాలం అదియొక యాత్రాస్థలమై అనేకమంది భక్తులు ఉదయం సాయంకాలం గుంపులు గుంపులుగా వచ్చి తమ ఆర్థిక, కుటుంబ సమస్యల పరిష్కారమునకు మార్గములను, శ్రీ సాయిబాబా అనుగ్రహ కటాక్షములను అపేక్షించి పొందేవారు. స్వామీజీ దివ్యసందేశం, సలహాలు వారిని తృప్తి పరచి, వారున్నచోటల్లా భక్తివిశ్వాసాలకు, పవిత్రతకు నిలయమయ్యేది. పలుసందర్భాలలో శ్రీ సాయిబాబా బోధనలను వివరిస్తూ శ్రీ సాయిబాబాయొక్క దివ్యమైన జీవితాంశాలను, సందేశాన్ని దేశం మొత్తం మీద ప్రచారం చేయడానికి శ్రీ నరసింహస్వామిగారు అమూల్యమైన, విశేషమైన కృషి చేశారని తెలిపారు.

ఓం

# నోటీసు

"అవతార్" శివానంద భగవాన్ (శివానంద నగరము, హృషీకేశము, టెహ్రీ - గఢ్వాల్ జిల్లా, హిమాలయములు) వారి జగద్విఖ్యాత ఆంగ్ల గ్రంథములు తెలుగున తర్జుమా యొనర్పబడి విక్రయమునకు సిద్ధముగ గలవు. దైవచింతన భగవత్కృప మోక్షసిద్ధి నొందుటకివి సాటిలేని మేటి గ్రంథములు. ఆధ్యాత్మిక ప్రచారము సర్వులలో తీవ్రముగ నొనర్చుటకై అసలు వెలలో సగము రేట్లకు మాత్రమే యీ దిగువ గ్రంథములన్నియు 31-12-61 వరకు నీయబడును. పుస్తకముల కోరువారు పుస్తకములో సగము సొమ్ము అడ్వాన్సుగ పంపవలెను. పోస్టేజి అదనము.

| | పుస్తకము పేరు | పేజీలు | అసలు ధర రు. న.పై. | తగ్గింపు ధర రు. న.పై. |
|---|---|---|---|---|
| 1. | భగవద్గీతా భాష్యం | 643 | 10.00 | 5.00 |
| 2. | కోపము - దానిని తగ్గించుకొనుట | 46 | 0.50 | 0.25 |
| 3. | ఆధ్యాత్మిక నాటకములు | 178 | 1.50 | 0.75 |
| | యోగజీవన ప్రకాశిక | | | |
| | Sure ways for success in life and Good realisation | | | |
| 4. | ప్రథమ భాగము | 248 | 2-50 | 1.25 |
| 5. | రెండవ భాగము | 234 | 2-25 | 1-13 |
| 6. | త్రిపుర రహస్యము అనే ఆత్మవిద్య | 269 | 2.50 | 1.25 |
| 7. | ప్రశ్నోత్తర భగవద్గీతాసారము | 138 | 1.50 | 0.75 |
| 8. | భక్తి సంకీర్తనము | 400 | 4.00 | 2.00 |
| 9. | మోక్ష మార్గదర్శి | 80 | 1.00 | 0.50 |
| 10. | మృత్యువనంతరము జీవాత్మ మేమగును | 232 | 3-00 | 1-50 |
| 11. | ఆధ్యాత్మిక కథలు | 186 | 3.00 | 1.50 |
| 12. | భగవద్గీతమూలము | | 0.50 | 0-25 |

ఇంకను ప్రచురింపబడవలసిన గ్రంథములు :—

(1) ఆత్మజ్ఞానము (2) ఆధ్యాత్మికానుభవములు (3) సమన్వయ యోగము (4) బాలుర దివ్యజీవనము

పుస్తకముల ప్రాప్తిస్థానము :—

నండూరి వెంకటసుబ్బారావు, B. A., S. D. L. S.

దివ్యజీవన సంఘాధ్యక్షులు

దక్షిణపు వీధి, ఏలూరు (ప. గో. జిల్లా)




**ఆధునిక కవుల చరిత్ర (ఒకటవ భాగం): శ్రీ కోగంటి దుర్గామల్లికార్జునరావు, భారతీ సమితి, పామర్రు, కృష్ణా జిల్లా. వెల 75 న.పై.లు**

ఇందలి యిప్పటి కవుల చరిత్ర రానున్న తరాలవారికి పూర్వకవుల చరిత్ర కాగలదు. సంస్కృతి, సాహిత్యముల అభివృద్ధికి కవుల చరిత్ర ఎంతైనా తోడ్పడునవి. పైగా కవుల చరిత్ర సాహిత్యప్రియులుగాను, కవులుగాను ప్రోత్సహించునవి. ఇందు 15 మంది కవుల సంక్షిప్త జీవితచరిత్ర, వారు రచించిన గ్రంథముల పేర్లను, అందలి మచ్చునకై కొన్ని పద్యములను, వారికి జరిగిన సన్మాన సత్కారములను పొందుపరచిరి.

**విదుర నీతి: శ్రీ పురాణపండ రాధాకృష్ణ. ప్రకాశకులు: అధ్యాత్మ ప్రచారక సంఘం, భారతశాఖ, రాజమండ్రి.**

మహాభారతంలోని విదుర నీతులు అత్యంత ప్రధానములయినవి. మనం ముఖ్యంగా పద్యముల రూపంలో చిన్నప్పటినుండి ఏదో తరగతిలో చదివియే యుంటాము. కాని సంపూర్ణంగా అధర్మాన్ని, అక్రమాన్ని అరికట్టడానికి, ధర్మాన్ని న్యాయాన్ని ప్రోత్సహించడానికని విదురుడు ధృతరాష్ట్రునకు బోధించిన నీతులు అమూల్యములై యీనాటికి సయితము మానవుని నైతికస్థాయిని పెంచుటకు వినియోగపడుచున్నవి. ఇట్టి విదురనీతిని గ్రంథకర్త వ్యావహారిక భాషలో పాఠకులకు సులభగ్రాహ్య మగునట్లు రచించిన యీ చిన్న పుస్తకము అత్యంత అమూల్యమైనది.

**లాస్యవిలాసము: శ్రీ యల్. భాస్కర్. ప్రచురణకర్తలు: రమణా పబ్లిషర్స్, చిత్తూరు. వెల 75 న.పై.లు.**

ఇందులోని మూడు నృత్య నాటికలు – ఊర్వశీ పురూరవము, మోహినీ భస్మాసుర, భగ్నదీక్ష రంగస్థలంమీద ప్రదర్శించడానికని రచింపబడినవి. పాటలకు రాగతాళములను సయితము నిర్ణయించి, స్వయంగా ప్రదర్శింపజేసిన తరువాత యీ గ్రంథం వెలువడజేశారు. మూలకథల నెన్నుకొనుటలోగాని, సందర్భ సన్నివేశాలను పొందుపరచడంలో కాని చక్కని ప్రజ్ఞను కవి ప్రదర్శించారు. ఇందులోని పాత్రలు ఆకర్షణీయమైనవై, మృదుమధురమైన శైలి, భావాలతో పాఠకులకు సయితం ఆనందం కలిగించునవిగా యీ నాటికలున్నవి. ఈ సందర్భమున కవి యీ రచనను నూతన ప్రయోగంగా చేబట్టారు.

**శ్రీమద్భగవద్గీత: శ్రీ శివానంద సరస్వతీ మహరాజ్. అనువాదకులు: శ్రీ నండూరు వెంకటసుబ్బారావు. ప్రచురణకర్తలు: యోగవేదాంత అరణ్య విశ్వవిద్యాలయము, హృషీకేశము. వెల రు. 10 లు.**

టీకాతాత్పర్య వ్యాఖ్యాన సహితమై సమగ్రంగా రూపొందిన గ్రంథము. భగవద్గీతను పఠించుటవలన మానవునకు ముక్తి మాత్రమేకాక యిహంలో సయితము సకల సౌభాగ్యములు సమకూరగలవని మహనీయుల వాక్కు. భగవద్గీతలోని ప్రతియొక్క శ్లోకం మానవుని తీర్చి దిద్దడాని కుద్దేశించిన దగుటచే అర్థం చేసికొని తన స్వీయశ్రేయస్సుకు, సౌభాగ్యమునకు భగవద్గీతను వినియోగించుకొనుటకు యీ పవిత్ర గ్రంథము ఉపయోగపడగలదు. అందులోను దివ్యపురుషులు శ్రీ స్వామి శివానంద భగవానులు రచన యగుటచే పరిపూర్ణతకు లోటు ఏమాత్రము లేనట్టిది.

# సంపాదకీయములు

## పడుపువృత్తి నిర్మూలనం

పడుపువృత్తిని సియోల్ నగరంలో పూర్తిగా నిర్మూలనం చేయడానికి దక్షిణ కొరియా ప్రభుత్వాధికారులు చండశాసనం అమలుపరుస్తున్నారు. ఆ ఒక్క నగరంలోనే 50 వేల మంది వెలయాండ్రు యుండేవారు. ప్రభుత్వం వారిని పడుపువృత్తినుండి తప్పించడానికి కొందరిని వారివారి గ్రామాలకు పంపేస్తున్నారు. మరికొంతమందిని ముందుముందు మంచి ఉద్యోగాలు చేసి గౌరవప్రదంగా జీవయాత్ర సాగించడానికి వీలుగా వృత్తి శిక్షణా విద్యాలయాలకు పంపనున్నారట. మూడు నెలలలోగా వ్యభిచార గృహాల నన్నిటిని మూసెయ్యడానికి, అలా మూసెయ్యనివారు దండించబడుటకు, రహస్యంగా వ్యభిచార గృహాలకు వెళ్ళే మగవారిని దండించుటకు గట్టిచర్యలు తీసుకొనబడుచున్నవి.

మనదేశంలో లాగనే దక్షిణ కొరియాలో కూడ పడుపువృత్తిని నిషేధిస్తూ శాసనాన్ని 1907 లోనే చేసింది కాని కట్టుదిట్టంగా అమలు జరుగలేదు యిప్పటిదాక. మనదేశంలో కూడ పడుపువృత్తి నిషేధాన్ని కట్టుదిట్టంగా అమలు జరుపడానికి తగినచర్యలు అత్యవసరమని ప్రభుత్వము గుర్తించాలి.

## ఉత్తమ సందేశం

ఈమధ్య కాంగ్రెస్ అధ్యక్షుడు శ్రీ నీలం సంజీవరెడ్డి సచివాలయాల చుట్టూ తిరగడం మాని, గ్రామాలలో తిరగమని కాంగ్రెస్ వాదులకు సలహాయిచ్చారు. అంటే కాంగ్రెస్ బలం పూర్తిగా ప్రజల సహాయసహకారములతో నిర్మాణం జరుగాలంటే ప్రజలతో సన్నిహిత సంబంధము అవసరము. ప్రజల సమస్యల నర్థముచేసికొని, వాని పరిష్కారానికి మార్గాల నన్వేషిస్తూ ప్రజలను తృప్తిపరచగలిగితే యీనాటికంటె మరింత బలం కాంగ్రెస్‌కు చేకూరుతుంది. ఇది ఎన్నికల సందర్భమున మాత్రమేకాక సాధారణ రోజులలో కూడ ప్రజల అండదండలు తమకు, తమ పార్టీకి అవసరమని ప్రజాప్రతినిధులు గుర్తించిననాడే ప్రజల విశ్వాస, ఆదరణలకు పాత్రులు కాగలరు.

## ఆకర్షణీయమైన నిర్ణయం

ఉపాధ్యాయుల పిల్లలకు అన్ని దశలలోను ఉచిత విద్యావసతులను కల్పించడానికి, ఉపకార వేతనాలివ్వడానికి ప్రభుత్వం నిశ్చయించిందని బెంగుళూరులో కేంద్ర విద్యామంత్రి డా॥ మాలి వెల్లడించారు.

విద్యావ్యాప్తికి చేయతగిన ఆకర్షణీయమైన ఏర్పాటులలో ఉపాధ్యాయుల స్థితిగతుల నర్థంచేసికొని వారికి సహాయంచేయడం ఒకటి. పాఠశాలల సంఖ్య పెరుగడంతోబాటు విద్యావిధానం, విద్యావసతులు ఆకర్షణీయం కావలసిన అవసరం చాలయున్నది. విద్యార్థులను, ఉపాధ్యాయులను ఆకర్షించడమంటే విద్యాభ్యాసం పట్ల బాలిబాలికలకు, విద్యాబోధనపట్ల ఉపాధ్యాయులకు ఆసక్తి, ఉత్సాహం పెంపొందాలి. అప్పుడే ఉపయుక్తమైన నిర్ణీత ఫలితాల నీయగలదు.

## దేశంలో పొదుపు

మనదేశంలో పొదుపు ఆకాంక్ష 20 శాతానికి పెరిగినట్లు జాతీయ ఆర్థిక పరిశోధన సంఘం ప్రకటించింది. ఈ విషయం సంతోషించతగినదే. ఆదాయానికి మించి నిత్యం జీవనవ్యయం విశేషంగా పెరుగుతున్న యీ రోజులలో మధ్యతరగతి కుటుంబాలలోని స్త్రీలు, పురుషులు కుటుంబ పరిస్థితులను అర్థం చేసికొని ఉన్నంతలో జీవయాత్రకు మార్గాల నన్వేషించడంతోబాటు భవిష్యత్తుకంటూ కాస్తోకూస్తో పొదుపరితనంవల్ల నిల్వచేయకలుగడం కుటుంబాలకు చాల సహాయకారిగా నుంటుంది.

పొదుపరితనం పట్ల యింకా మరింతగా ఆసక్తి స్త్రీ, పురుషులకు పెరగడం ముమ్మాటికి మంచిదే. అయితే పొదుపు చేయడానికి వసతులు కూడ యుండాలనే విషయం మరువరాదు. అనవసరమైన ఖర్చులను, ఆడంబరమైన పోకడలనుగాని, దురభ్యాసాలను కాని స్త్రీలు, పురుషులు మానుకుంటే పొదుపు మరింతగా చేయవచ్చును.

Printed & Published by Dr. S. Seshagiri Rao at Lodhra Press, Kesari Kuteeram (Private) Ltd. 15, Westcott Road, Royapettah, Madras. Editor : C. C. Punniah.
Proprietors . Kesari Kuteeram (Private) Ltd.

LODHRA PRESS, MADRAS-14.